ఉ॥ "ప్రేయసి! నీకురూపుపస బీజముగా మొలకెత్తెఁ బ్రేమ, యా
రా! యనిపింపఁజాలు ముఖమందలిభావముఁ జూపు నేర్పున
న్నా యెదనిండెఁ, గైతకు మనంబును బూర్తిగ దింపుహేల కా
ప్యాయత చూడు! వెల్లివిరియంబడుచున్నదిమేన నంతటన్॥ 216

ఉ॥ కౌరవు లేఁచి చేయునపకారములెల్లను నెత్తిచూపి రో
షారభటి న్నరుం బిరుసువ్యాసమున న్నిపుణాణమొందఁగా
వీరతఁ బ్రోత్సహించు పరవీరభయంకరమైనకృష్ణయా
కారము నిన్నుఁజూచి పలుక న్నెమక న్ననిలేదు నాయికా! ॥ 217

ఉ॥ భ్రూముడిపైనఁ గుంకుమము బొట్టును వీక్షణతీక్ష్ణరోచులు
న్నామనివారణంబునకుఁ గాలగళుండు వహించునాకృతి,
స్థేమముగాఁగఁగాళి సరవి న్మహిషాదులఁ గూల్చువేషము
న్నామదిఁ గొల్పి కొల్పెను ఘనంబగుమోద మసంశయంబుగన్॥

ఉ॥ మామనిరాసనంబు, హృది మాడ్కిడి యత్తవచోహతు ల్పర
ల్లాపము నసహ్యభాషలు భరంబులు, వీనికిఁదోఁసు నీవునే
యామటు క్రిందమూపుల నొయారిపొయైన మదీయపాప ము
ద్దామతఁబండియుంగు, బలె! తప్పె నపాయము, చింతలేదిఁకన్॥ 219

ఉ॥ బింకమునందుఁ బెట్టినదిపేరగు నాయెద కెక్కఁజాలు వీ
రాంకవు నీవునాకు సతివౌట యదృష్టముపెంపుసూవె! నా
కింకొకకింక లక్ష్యమ? సఖి! కడుసమ్మదమయ్యె, నీనుడిం
బొంకము పొందులేని యొకపొల్లగుమాటయు రాదు మెచ్చితిన్॥

చ॥ అనుభవ మింతలేనియొకయాఁడనిసుంగట! యారితీఋథీ
జనము నొకొక్కచోఁ బలుకఁజాలని హేతునిబద్ధమై నయం
బెనసి సమగ్రతత్త్వనర నింతటిదక్షతఁ బల్కనేర్చు! కొం
దును గమనబ్బురంబగుచుఁ ద్రోయఁగరానిదిగాఁ జెలంగదే? ॥ 221

చ॥ అయినను ముందువెన్కరయ కాతురముబ్బఁ దెగించి కార్యని
ర్ణయమెదిలేక పూనఁగ ఘనంపుటనర్థము లుద్భవిల్లుఁ, బ్ర
త్యయమున బాగునోగుఁ గని యవ్వల నేర్పునఁ గార్యమూన ని
శ్చయముగ సంపద ల్వలపెసంగఁ దమంతటఁజేరు నిండుగన్ ॥ 222

ఉ॥ కోపము దట్టమౌమసుగు కొంచెము గొప్పయు, మంచిచెట్ట, మే
లాపద, పీలుఁజాలుఁ, దగునా! తగిదా! యని యెన్నసీయ దా
యేపునకు న్వివేకి చలియించునె? వాగెల రౌతు మావున
ట్లాపస తెల్వియై దటికి నందఁగఁ జూపఁడె బుద్ధిధారలన్? ॥ 223

* తే॥ కార్యబీజాళిని వివేకకంకణముల
నించి పాలించువానికే నిండుఫలము
లంబుదమువలె వాఁడె లోకాగ్రవీర
వర్తియై సంతతసుఖంబుఁ బడయుచుండు॥ 224

ఉ॥ కావున, శాంతమే యిపుడుకార్యము, దానికి హేతువుండియు
న్నేవచియింపరాదిపుడు, నిల్చుకతం బది తీఱువెన్క నీ
రావును నాలసింపక విడన్గలవాఁడవు నిక్క మంతకు
న్నీవును నాకుఁగా క్షమగణింపుము నోపికఁజిక్కఁబట్టుమీ! ॥ 225

చ॥ అనఁగ ససమ్మతిం దెలుపునాస్యమునంగ సతత్వభావసం
జనితమనోజ్ఞత ల్విసయశాంతరసాంకము లుద్భవింప నే
గు నబలఁ గాంచి యాతఁడనుఁ "గోమలి! చింత నిఁకంద్యజాపు మే
ది! నగుమొగంబు మేల్తొగరుదీప్తులు చెక్కులఁ జిందిపర్వఁగన్॥

ఉ॥ నీనగుమోముచందురుని నిగ్గులెసూ ననుముంచు మేఘముం
బోని విపత్తమం బడలిపోనడలింపఁగ! రాయియైననా
మానసముం ద్రవించుగరిమ న్గనఁజేయఁగ! నేది! క్రమ్మలిం
బూనుము మందహాసమును బోయెదు తొట్రిలెదేల? నెచ్చెలీ! ॥

చ॥ తమకెదనంచునుం జడిసెదా! యిదె దవ్వున నిల్చువాఁడ, రా
నమరికఁ దొట్టుచిర్నగవు నాపకు నోటికెలంకులంచుఁ, బ్ర
క్కమొగము వెట్టు నాహాయలు కారణమై యదె! వెల్గుచీఁకటు
ల్సమత నిటట్టును న్వెలయుచక్కని మేరువు నూహఁగొల్పెడిన్॥ 228

చ॥ ముసిముసినవ్వొచాలు ననుమోద మొసంగెడి, పొద్దుగుబ్బకా
వెస శశిచేరినంత నలుదిక్కులుఁ దేటలఁ దేలుఁగాదె? ప్రే

---

* అభివర్షతి యోఽనుపాలయ న్విధిబీజాని వివేకవారిణా ।
స సదాఫలశాలినీంక్రియాం శరదం లోక ఇవాధితిష్ఠతి॥ భా స ౨. శ్లో ౩౧

యని! యెదియెట్టులైన హృదయంబునఁ గుందకు, కుందునైన సం
తసముగఁ గాంచువారలకు దాపుసుమీ! యపవర్గసౌఖ్యముల్॥

శా॥ నాదేహంబున నేవళమ్ము మిసుము ల్గానాటఁ [illegible]
[illegible] [illegible] చేసి [illegible] [illegible]దేయు[illegible] ప్రాప్తైం[illegible]
కేదారి [illegible]గుపాటుచేత [illegible]సుమీ! [illegible]క[illegible]నా[illegible]గ్య, మా
హా! దైవాజ్ఞవిచిత్ర! మన్నిఁట నచింత్యానందమే తోఁచెనిక్ 230

మ అవియుంగా కిటఁ దోడివార లొనరైనప్డెల్లఁ "[illegible]రాదికా
పదలన్ దోఁపగు [illegible] నాము లొనరింపఁ జూచి యేఁగూడ నే
ర్చెద బాణా వడిఁ ద్రిప్పఁ గర్గనుము తచ్చిత్రంబటం చాలు స
మ్మోదింపన్ బహుభంగుల న్వలయుసాము ల్చూపె నాతం డటన్॥

మ॥ వెలిదెబ్బ ల్పరిపోఁకపులు న్విసరులు న్వెన్కొత్తులు న్దాటులు
న్మలుపు ల్మార్కొనుట ల్మలంగుపరుగు ల్మధ్యాహతు ల్చూపుత్రి
ప్పుల బాణా తనచుట్టుఁ జిత్రవలయంబు ల్గోల్పు వక్షంబువి
ప్పులయ న్గాళులు వింతదాట్లఁగొన నెంతో నేర్పుఁ జూపెంపఁగన్॥

చ॥ భయ మటువెన్కనబ్బురముపాటు పదంపడికౌతుకంబుఁ ద
న్నెయిదఁగ, లక్ష్మి, యాగరిడియేపుల నేటుల నుబ్బుభావము
ల్పయికొన హస్తపాదగతి భర్త కెటుల్పడుచుండె నట్లె తా
నయి పెనువింత సమ్మదము నాతని కేర్పడఁజేసెఁ బెల్లుగన్॥ 233

ఉ ఆగతి పొమ్ములంగముల, నాసరిదూఁకులు కాలుసేతులం
దా గరువంపుఁజూడ్కిఁ పరు వక్షుల నాతనిమోముఁ బెంప, "హో
హో! గరితా! కుతూహలము యోగ్యతఁగన్గొన బాణవిద్య నీ
కాగతమా సుసూక్ష్మముగ" నం చొకకోలను జేతికిచ్చుచున్॥ 234

తే॥ "గట్టిపిడికిటఁ గోల నిక్కరణిఁ బట్టి
యిట్టు లీరీతి నీచాయ నిల్లు త్రిప్పు"
మనుచు మెలమెల్ల నావిద్యయందు సతికిఁ
దివురుకుతుకంబుఁ బెంచె భారవి కరంబు॥ 235

ఉ॥ బాల్యము లౌల్యముం జనవు భర్తృసమాదృతి పైకొన న్గృహా
క్షౌల్యము సన్నగిల్లిచన, చాన, క్రమంబుగఁ గొంకుజంక సా

కల్యముగాఁగఁ దత్సమయగౌరవనీయ సతీస్వకావనా
మూల్యతదీయచంక్రమణము ల్దివసక్రమయుక్తి నేరిచెన్॥ 236

ఉ॥ ఎట్టినిమెండవేఁడి యొకయింతయు విఘ్నముకాదు, త్రిప్పుడుం
గట్టల వంకర ల్నిలుపుఁ గల్పనసేయవు, కందిచేనిలోఁ
దెట్టలె సాముప ట్లచటఁ దేజినబోదెలు మిట్టపల్లము
ల్నెట్టెలు నాఁడునాఁట నడనిగ్గులలోఁ గొనియె న్సమత్వముల్ 237

ఉ॥ కాలిటుమెట్టఁగావలయుఁ గైనిటుత్రిప్పఁగవీలటంచుఁ దా
నాలిని దిద్దువేళలఁ దదంగము సోకిన మేన గగ్గురు
ద్దేలి నవీనసౌఖ్యమునఁ దెంపున జల్లనుగుండెదాఁటుల
న్వాలికచూడ్కుల న్మొలఁ చుపట్టుల మన్మథుఁ డాడు నట్టువల్॥238

చ॥ అపుడు మగండు ప్రేమజనితార్భటి నిండినచూడ్కిఁ జూడఁగా
రెపరెపలాడు మానసమురీతి బలంబయి లక్ష్మి కౌప్పల
న్దపతపఁగూర్చెఁ దద్రుచిరనాట్యము తిగ్గెకుదీపగోపురం
బుపస నొసంగె నుబ్బఁగొనుమోహమహాబ్ధి భ్రమించు వానికిన్॥

ఉ॥ రైకఁ బిగుల్చు చన్నుఁగవరాయిడి పైటకు బింకమీయఁ గ
న్దూఁకులఁ జెక్కిళు ల్నొగరుతోఁపుల నుబ్బఁగొనంగ వీఁక థా
థాకలఁ గల్వకంటిలగుడంబులు మాటికిఁ బైఁబడంగ న
ట్లాకల బిట్టునొంచెఁ గుసుమాస్త్రుఁడు భారవిఁ బొంచుపోటులన్॥

ఉ॥ మోహముకైపునన్ మిగులముగ్ధుఁడు భారవిభట్టు పూర్వస
న్నాహముమాని కౌఁగిలిని నాఁచుకొన న్జెయిఁ జాచుచుండ నా
యూహ నెఱింగి తుట్టనె నవోఢ, భయంబొ విలాసమొక్కొ సం
దేహముపీడ కాతఁ డటనిల్వఁగ నాతనిభార్య దవ్వనన్॥ 241

చ॥ "తమ కెదనా?" యటంచుఁ గడుధైర్యము బాసనొసంగనాథ్యులౌ
తమ కెద యింతలో బిగువుఁదప్పుట తప్పట, తప్పెట న్బికో
త్తముఁడు కుహూకుహూనినదధాటిని జాటెడి, నేఁటి కాట చా
లు, మగుడుచుంటి నింటి", కని లోలశుభేక్షణ కేలుమోడ్చినన్॥

మ॥ అరచేముద్దున హస్తమెత్తి "భళి! వహ్వా! నెచ్చెలీ! భ్రాంతియొ
క్కరవంతేనియు లేనిరిక్కవన నిక్కంబయ్యె మేల్కొంటి, నా

పొరపొటొంచుచు రేపు రావెటచెదేమో! నమ్ము మీమాటు ని
బ్బర మింతేనిఁ జలింపనీ" ననుపతి న్బల్మాఱు వీక్షించుచున్॥ 243

ఉ॥ "ఇంతటికల్పుకోత్తనము నీసయిదోడులఁ గూడురక్తి యీ
మంతనమందు నిష్కపటమాధురిఁ జిమ్మెడిపీరు పల్కరిం
పింతయులేమి నెట్టుల వటించిరొకోమది నిన్నినాళు లీ
సంతనయే మహాపథము సాగెడుఁగావుత మిట్లు నిత్యమున్"॥ 244

మ॥ అనుచు, న్మాటికి మళ్లిచూచుచు, మగం డావంకఁ జేపీవ వం
దనముంజేయుచు, నేగులక్ష్మి నతఁడు న్గజ్జూపుమే రేగునం
దనుక న్నిల్చి, నిజార్హ్యకృత్యములలోన న్శ్రద్ధఁబూను న్గ్రిమం
బున, నిత్యాబిటులే సమాగమము తెప్పుల్లేక వర్తింపఁగన్॥ 245

సీ॥ పులుఁగుకూఁతలకు నింపులు నేర్పుపొలికేక
నోడిసెల న్విసరుఁ దానొక్కదినము
ఒంపుపూపులకు మేల్కాంతి సంధిల్ల నా
చెంత నొక్కొకనాఁడు చేరిమలయు
కలుపు మాకేగాని కాదు పీకన్నట్లు
కలు పొక్కహంబునఁ గడఁకఁదీయుఁ
గౌతుకంబునఁ బెద్దరాతుగా నొకప్రొద్దు
చిఱుగుట్టమున న్వారిఁజేసి డాయు
కట్టి నొకదానిఁ బాఁతి లక్ష్యముగ సాము
సాధనమొనర్చు నొకపవల్ సారసాక్షి
మగఁడు ఫలహారముంగొని మంచెక్రిందఁ
బంచెఁ బఱిచి పయి న్విశ్రమించుతఱుల॥ 246

మ॥ "తొలిరో జొందినమారవిభ్రమము నెందు న్గ్రిమ్మఱు న్గజూప రే
యలుక న్పొందినజాడయుంగలుగ దాహా! నాఁడటు ల్పర్వన
ద్దొలఁగంబాఱిన లోఁజిపుక్కురుమన ద్దోషంబుదోషంబుత్రో
పుల నేయార్తి ఘటిల్లునో" యనుచు సల్పు న్లక్ష్మి సేవ ల్తమిన్॥

ఉ॥ కన్నులకుబ్బి కుత్తుకకు గట్టిగమూఁగి గగుర్పుతోడ మై
యన్నుకొనంగ రేఁగి మనసా! దడఁ దొట్రిలసాగదేల?, ని

న్మన్ననఁజూపి యాతఁ డభిమానముఁదక్కి వరింపకున్న నీ
తెన్నె యిదేమొ! ' యటంచును సతీమణి బెగ్గిలుఁ జిన్నవోవుచున్॥
ఉ॥ అంచెకమంచె యాత్రలఁగు నైనను లాభమునున్న స్వవ్రతం
బెంతకుఁ బోని వార్నిధిగ నేపుల మహ్యమునొంది హారుల
న్వింతమెఱుంగుఁ గూర్చు, సవివేదుక చెన్కునె చిత్తవిధికిన్?,
గాంతచన న్విరాగియెసఁగ న్గడుచేరువ నిల్చినట్లుగన్॥ 249
ఉ॥ ఓచిరునవ్వుసోయగము నాయరవాల్చినమోము గోము నా
మేచకవర్ణనేత్రముల మేకొను క్రీఁగనుచూపుకోపు నా
వాచవి నూరిమీఱు రసవన్మధురోక్తుల తీపియేపు నా
రా! చతురాస్య శేషదివిజాధిపులే న్బలుక న్వలంతులే? ॥ 250
చ॥ అరుదులభ్రూవిలాసనిచయంబుల నుద్ధతుల న్గ్రమించుచు
న్బిరబిరదాఁటి నూటి నలచిత్తరి క్రేఁగనుచూపుటంపఱు
ల్బుఱుకుచుఱుక్కున న్నిగుడ చుమ్మలువాటెడిమానసంబు ప
ల్మఱు మరులూని మారుఁడను మాంత్రికుఁ దుంచిన పోల నోలుచున్

—♦ లక్ష్మి భారవుల కార్యమునందు భారవినిష్ఠ ♦—

ఉ॥ ఈవిధమై యెడందల రతీశవిలాసమెసంగఁ బైకి నా
భావమొకింతయు న్వెడలఁ బొఱనివైఖరి వార లందు నా
నావిషయప్రసక్తుల దినంబుల నెట్టుచునుండఁ గూఁతు తే
జోవిధ మాత్మ శంకకును జోటిడఁ దల్లి ప్రమతంబ నాథునిన్॥ 252
ఉ॥ చేరి “యిదేమిబింక మొకో! చిన్నతనంబనికాని, కృత్యము
ల్భారములంచుఁగాని వలవంతఁ గొనం డొకనాఁడు నేని, నే
కారణమొక్కొ! నే ననెడికాఱుల కుల్కక తుష్టి నవ్వ సొం
పూరుముఖంబుతో మెలఁగుచుండు నితం డిట నిందుతాలిమిన్! ॥
క॥ జననిజనకులపొలకువ
వినమింతయు, వారు యాత్రవెడలి బహుదినా
ల్బునిమె, నిలుసేరకుంటకు
ఘనమగుభేదము విరక్తిఁ గలిగించెనొకో?॥ 254

మ॥ మనకు న్జాకిరిసేయఁగాఁ గుదిరె నేమా కేటి కన్దప్రాప్తి "గ"
మ్మని మీాహారకయుండ "నిల్లటము తెమ్మా! భాగమం"చితఁడా
డిన రేపెట్టులు?, "పూర్వనాధితముమాకే లేమ నాస్వార్జితం"
బని వియ్యంకుఁడు సున్నవెట్ట గతియేమా వీనికి న్జూడరే?"॥ 255

చ॥ అని సతి చెప్పి చూపువ్యవహారపుఁజిక్కుల నాలకించి "యే
మనవలెనే? కతంబడుగ నట్టిటుఁబల్కఁడు వీఁడు వారివ
ర్తన మిదియుం చెఱుంగఁదగు దారియుఁ దోఁపదు, పొమ్ము" లేచిపో
మ్మనఁగలమే? యతండుచన నవ్వల దానికి నేదిమార్గమా?॥ 256

ఉ॥ యాత్రనో పారియాత్రనో తదన్యముఁ గందొకో? వారిపోక యే
మాత్ర మెఱుంగరా, దితని మాతులుతావునన్నైన లే, రస
చ్ఛాత్రులు వీనియూర నిదిచాయయటంచు వచింప రింకనే
సూత్రములేదు కాఁగలది మాచుచు నూరకయుంట తక్కఁగన్॥257

మ॥ పతిపల్కుల్విని "యట్టులేని నిఁక నిల్పన్రాదు కార్యంబు ని
గతి నొక్కింటఁ జరించు వీరలకు నెక్కాలంబునం దెట్టులౌ
నో? తగ న్మాత్రముఁజూచి జ్యేష్ఠసుతల న్దోతెం, డిటెవ్వారిను
స్థితి కెవ్వారలు పూఁచికాఁగలరు? వ్రాప్తె న్మార్పఁగా శక్యమే?"॥258

ఉ॥ నావుడు, భార్యపల్కులు మన ప్రియము న్ఘటియింప, "నేను ని
భావము నూనియుంటిఁ, గడుబాగుగఁ జెప్పితి వీవు మే", లటం
చావసుధామరుండు సమయజ్ఞుల పెద్దల సంప్రతింపుతో
నావిధి వెళ్ళఁబుచ్చెఁ, దనయాప్తులె చేరిక వేడ్కఁ జేయఁగన్॥ 259

ఉ॥ అక్కలనాఁటికార్యముల నైనవిలాసముల న్మతాంశముం
దక్కమిఁ జిన్నవోవువనిత, న్దనయుండెనయున్కి హేతువై
యొక్కరణి న్వినోదము వహింపనిభారవిభట్టు నొక్కఁడే
ప్రక్కకుఁజేర్ప నేరికట భవ్యసుఖంబని పల్కనేర్తమో?॥ 260

చ॥ గడెపడెఁ దల్పు, తల్పమునఁ గాంతుఁడు కన్బొమ మోడ్చియుంటకు
న్గడెపడె లక్ష్మిచిత్తమునఁ గారణమేమియొ పొల్పలేమి, న
య్యెడరుగ్రహించి భారవ రియుంబునఁ జేరఁగి నేగి "ప్రేయసీ!
జడియకు రమ్ము! నీవలన సాయముఁ గోరెద నాలకింపుమీ!" 261

మ॥ అనుచు న్భృత్యకు దాపుపీఠముఁ సధ్యాసీనఁగ వించి తా
నును సెజ్జ న్దఱిగా వసించి, చెఱఁగంచు న్జేతుల న్బూని వా
ల్చినమౌళి న్నిలుచున్న జాయఁగని, "యోసీమంతినీ! నెచ్చెలీ!
వినవేవింటివిగా వ్రతం బెసఁగున న్వృత్తాంత మీవింతకే? ॥ 262

మ॥ వ్రతసంపూర్తి యెసంగుదాఁక నియమవ్యాపారము ల్వీడు టు
న్నతికి న్జేటగుఁగాన నంతవరకు న్సాంగత్యము ల్మాఁడునే?
పతికిన్భార్యకు?, దీని నేవరుసఁ జెల్పన్వచ్చు నీ కంచు నొం
దితిఁ జీకాకొకయింత ధైర్యమును గొంటి స్థిర నీవాటచేన్ ॥ 263

మ॥ అతనుం డైదుతల ల్ధరించు తనదివ్యాస్త్రంబు నాపై సము
ద్ధతిఁ బంపం, బలమేది లోఁబడెడు నాప్రాణంబులైదు, న్గడు
న్ధృతి నాయారవప్రాణమీవు, నను శాంతిన్దేల్చెదో భ్రాంతికా
మెతగా ముంచెదొ, భారమంతయును గొమ్మీ! దారిఁ జూపింపుమీ!"॥

చ॥ అను పతివాక్యము ల్విని, వయస్య, శుచిస్మితదృష్టి నాథు మే
నున కొక చామరంబగుచు నుక్కట మీదికిఁ గ్రింది కాడు నీ
వనయన హాయిఁగొల్పఁ, బతిపాదసరోజపుటంబులందుఁ గే
ల్నలను నిగుడ్చి పుణ్కి నయనంబులఁ గైకొని పల్కె నిట్టులన్ ॥ 265

చ॥ "తమ కనుసైగ యాజ్ఞగ సతంబును గొల్చి తరింప నున్న నా
కమరునె వేఱుభావము?, నయజ్ఞులు మీ రెటునిర్ణయించి రా
యమరికయే మదీయపథమయ్యెడు, నయ్యది యట్టులుండ, ని
త్యముఁ బరిచర్యకైనను దయ న్సెలవిచ్చిరఁ గొండనెక్కెదన్ ॥ 266

ఉ॥ ఈమనపొందు నేఁడు విధియించినపెద్దలకోర్కె నుంచుఁ డే
నే మిడిమేలఁపు న్బిడియమేనియుఁ బోవిడి మీయసడ్డచే
నోపుట తక్కి చిక్కి మిము నూఱటసాక ఘనావకాశ మి
ప్డీమెయి నొందినందుల కివే పరమేశునకు న్నమస్కృతుల్" ॥ 267

చ॥ అన ముదమంది యాతఁడు శయానుఁడుగాఁగఁ బదంబు లొత్తుచు
న్దనహృదయేశ్వరుండు కనుదమ్ములు మోడిచి నిద్రఁ జెందుఁ నం
దనుకను సేవఁజేసి సతి ధారుణి వేఱొక సెజ్జఁ గూర్కె, నీ
యనువునఁ గాలమేగఁ దఱియయ్యెను శ్రావణమాస మంతటన్ ॥

ఆ॥ వె॥ జ్యేష్ఠసుతకుమార్తెయే తన రెండవ
కొమరుభార్యయగుటఁ గోరి కార్య
మునకు వచ్చియున్న తనయులఁ బతులతో
నిలిపె నోములను గణించి జనని॥ 269

తే॥ పెద్దకోడలు మనుమరాల్వేడ్కచెలఁగ
నోములకు సిద్ధమగుచుండ నామతించి
తల్లి యప్పలు వారి కంతయును దిద్ద
నడుగు వాల్లేక లక్ష్మి తారాడుచుండె॥ 270

శా॥ "నామాటే తలపెట్టదమ్మ, పరులంద ర్వారిసంతోషమే
ప్రాముఖ్యమ్ముగ సంచరింత్రు, విడువన్నానట్టివీనోము, లే
నేమంచు న్జని, 'తల్లి! నన్దలఁపవేమే' యంచుఁ బ్రార్థింతుఁ 'బో
పో! మామయ్యయొ యత్తయో మగఁడో ముద్దు న్గూర్చునాఁజాలదే?॥"

క॥ అడుగ న్మెరమెరపడు, మఱి
'యడుగకునికి నోము జరుగునా'యని యడుగ
న్దోడరు, గడునెడరుటవమతి
పోడమునోయని యడుగు టుడుగుఁ బొలఁతి చిడిముడిన్॥

శా॥ చిన్నంబోయినమోముతో నెడఁబెడన్జెరు స్రవం తేరు త
న్నన్న న్గౌతుకమిచ్చుకంబుఁ గొలుపంగాఁజూచు వారేది 'తె'
మ్మన న్గొబ్బునఁ దెచ్చియిచ్చుఁ, దుది నేర్పైన న్వినోదార్థమై
న 'న్నీవు న్నరికె'మ్మటందురనుచింత న్గోర్కు లజ్జాడఁగన్॥ 273

క॥ "ఔరా! యీనిరసన మీ
తీరగునతిశయము! వీరితె న్నిఁకనేలా
కోరగ?" నని ధీరతఁగొను
నారీమణి లక్ష్మి మఱి వనట లోఁ గుములున్॥ 274

చ॥ అహుగునునా! పతిన్? యుడిగమం దిటనుండినవారి కెట్లుచే
పడియెడు రొక్క? మెయుపమఁ బల్కుదురో, యిఁక వారుగాక నా
యెడరువినంగ నిందెవరునేని నెసంగిరె? వినొసంగిరే?
తడసిన యేరుపా టొకటి తాఁదనయంతనఁ గల్గఁబోవునే?॥ 275

శా॥ అమ్మా! యింతటిచిన్నచూపటవె? భాగ్యంబున్నఁ బైఁబూసికొం
టిమ్మైఁ జెందుటె లేమిడి? న్నరులఁబోని మ్మీవె ‘నాప్రేగ’ నాఁ
కిమ్మాడ్కి న్నెడమోముఁ బెట్టుటయె? పోయె న్నేమమున్నాలి, యా
యమ్మన్నోర్చలినదాననేను, జనని న్నాయెచ్చ న్సమీపింతునే?”। 276

క॥ అని యనుకొనులక్ష్మి కరం
బునఁ జుబుకముతో గవాక్షిముందట నెదియుం
గనక విడఁ బొటుకన్గవఁ
గనుపడఁగాఁ జూచి తల్లి కడురభసమునన్॥ 277

ఉ॥ “మాతిముడుంగఁ గన్బొమలు మూఁగ నిలంబడ నేమిలాభమో
కూఁతుర! యత్తవారు సమకూర్పఁగఁదగ్గవినోము, లేమి తా
సీతటి సల్పునో యడుగుమీ! మగని, న్జుటమోచెదేల? నీ
వ్రాతకు నుమ్మలింపుమ యెవం డిట నెంతటిదాఁకఁ బ్రాపిడున్॥

శా॥ కార్యంబుం దొకచిల్లిగవ్వయును దేఁగాఁబూనఁ డెవ్వారు నా
శ్చర్యంబొందిరి, ముచ్చటా! పలుక! చాల్పా ల్పఁబడుంబమ్మ్యా!, ని
ధైర్యం బేమియొ బిడ్డనిక్కడవు చేతా కేమిచేకూర్చునే?
వార్యాదు ల్కొనిపొమ్ము చేని కిటనిల్వ న్నిల్వసొమ్మబ్బునే॥ 279

చ॥ కడసరికూఁతువం చొరులు కానరీతిగ మంచిచెట్టల
న్గడపెతినెట్టొ యిందనుక గౌరవయుక్తముగా దినంబు, లె
ప్పుడు నటులే యొనర్చుటకు బుగ్గయొ పెన్గనియో యొసంగి దిం,
డెడనెడఁ గల్గు దెప్పుడుల కే నికఁ దాళఁగలేను తెల్పితిన్”॥ 280

క॥ అని కొసరుకసరుతోడ జ
ననియేగిన యుడుకుఁగొనుమనంబున లక్ష్మి
వనితయు వలసినవానిని
గొనిచనెఁ బతిఁజేరి తెల్పుకొనఁ బొలమునకున్॥ 281

— ♦ భారవి స్నేహితుఁడగు నారాయణుఁడు యతివేషమున వచ్చుట ♦ —

ఉ॥ అంతకుమున్నె యచ్చట మహాత్ముఁడు భారవి శాలిపాలనా
క్రాంతమనంబున న్వేలయఁ బ్రాంతపథంబున వచ్చునొక్కఁడం

దంతట నింతట న్నిలచి యాతనిఁగన్గొని నిల్వనీఱుగా
వంతమునింపఁ గుంది "భగవానుఁడ! ఘోర"మటంచు నార్తుఁడై॥

క॥ ఒకతాఁడిబోదెవెన్కఁ జ
తికిలంబడి "నిర్దయావిధీ! యీతని నిం
తకుఁదెచ్చితివె? చెడునొడుదు
డుకుల న్నము వేఁపుచే కడు న్నికలరే? ॥ 283

క॥ ఓప్రాణసఖుఁడ! వ్రతమని
నాప్రాణముఁదీసి బౌస నన్నట నిలువ
న్వేప్రార్థనము లొనర్చి, య
హా! ప్రారబ్ధానుభోక్త వయ్యెదె యిచటన్?॥ 284

క॥ అనుకొనినయంతయైనది
కనఁగల్గుదు నత్తవారికడ నిన్నని తో
ల్తనె యిందు వచ్చి నందుల
కు, ననుస్కారముల భక్తిఁగూర్తు న్వారికిన్ ॥ 285

సీ॥ రాట్సభాద్విజకోటి రంజించునీపాటి
యీద్విజారవధాటి నెగపనగునె!
కేదారకళమీటి వాదించునీపాటి
కేదారకళఁ బాటు నూఁదనగునె!
పేరుకాల్వలుదాఁటఁ బెడలొత్తునీపాటి
పేరుకాల్వలు మాఁటఁ జెరనగునె!
మేటిసూరులఁ బోటి మిడికించునీపాటి
మేటిసూరులగాఁట మెలఁగనగునె!
తే॥ నృపుబికారిగ మఱి బికారిని నృపునిగఁ
జేసి రంగాంతరంబులఁ జిత్రనాట
కంబు లెసఁగించు హరిప్రపంచంబునితి
దుఃఖమును నిర్భరసుఖంబుఁ దూఁచు త్రాసు!

సీ॥ గంటంబువోయి నాఁగలి మేఁడి చేఁజిక్కె
నే కవిత్వావనీనేత కిచట?

పదచాలనం బిట్లు పదచలనంబుగా
మాఱెనే కావ్యనిర్మాతృకిచట!
ధారణయెల్ల సాధారణకృషిమాత్ర
మయ్యెనే యవధాని కకట! యిచట!
ధ్వన్యలంకృతు లసధ్వన్యలంకృతులుగా
నమరెనే సూరిజనాగ్రణి కిట!
తే॥ మహితవేదాంతవాక్యార్థమహిమ మేగి
బహుళసీమాంత సీమంత పటునటనము
వఱలెనే యిందు మేటిసర్వజ్ఞునకును!
భారవీ! యేల నీ విట్లు చేరితోయి?॥ 287

సీ॥ ప్రకృతిశోభలఁ బుణ్కి పలుమెఱుంగుల నూర్పు
నూఁదుటో నీబోటియోధున కిది?
యూహాల జిలుగు చె న్నొడికంబు చికిలిచే
జీవమిచ్చుటొ యేమిత్రోవర యిది?
వ్యక్తులభావసంపదల దక్షతఁ గావ్య
రంగంబుల న్గొల్పుక్రమముర యిది?
రసధునీబహుళతరంగసంప్లావిత
చిత్రకథాకళాశిల్పమ యిది?
తే॥ తురగధారానుకారివాగ్ధోరణులను
జిత్రబంధకవిత్వవిశేషములను
రసికత మెలర్పఁదగు విహరణము యిద్ది?
బేలవై యేలరా యిట్లు జాలిఁబడితి?॥ 288

ఉ॥ ఒట్టిడి యాంతుఁగట్టి వెఱయుంచితి వక్కట! నీదుప్రోలకే
నెట్టుల వచ్చువాఁడ నిది యిట్లని సర్వముఁ దెల్పువాఁడ? నా
కట్టిడి బమ్మ మర్త్యులకుఁ గష్టముఁ గొల్పుచు దాఁటువాలు క
న్పట్టఁగ జేయకున్న మనవంటి మహార్తుల కేదిదారియో?॥ 289

సీ॥ నీయెడబాటు మున్నే సగంబు కుదించె
మిహిరుచేఁ గడమయు మిడికిపోయె

నింక నా కేసౌఖ్య మేటి కన్న విరక్తి
దిగఁదీయ దిగఁదీయఁ దెగువఁజేసి
తల నున్నగావించి మోఁ గావిని బిగించి
పావకోళ్లు ధరించి భయము డించి
దండంబు సంధించి కుండి కై మెఱయించి
జందెంబు మొలనూలుక్రింద నెట్టి
తే॥ నొసటిపై భూతిరేఖలు పొసఁగ బొంగు
మ్రోత మాటలు వెడలంగఁ బొందుఁగూర్చి
వెరవుమై యతివేషంబు వేసినాఁడ
నిన్ను నెమకు తలంపులు నింగిముట్ట॥ 290

తే। పొల్చుకొనకుంటివో మేలు పొల్చుకొనిన
ముంచుకొనిపోవునదిలేమ పొమ్మటంచు
ధైర్యమూనితి బాస నింద్యమగు ననుమ
చిత్తశుద్ధిఁ గృతు ల్జయం బెత్తకున్నె?"॥ 291

క॥ అని లేచి హుటాహుటిగాఁ
దన పాదా లులియ నడుచు దండిని గని భ
క్తిని భారవి ప్రవరనుడివి
మును సాష్టాంగప్రణామమును గావింపన్॥ 292

క॥ "ఏరా! భారవివా! ఏ
పే రటనటవింటి మంచివిజ్ఞుఁడవఁట యే
దీ! రమ్మ! కొంత యాతరు
తీరమ్మున గోష్ఠిసలుపఁ దెమ్మ జలంబున్"॥ 293

చ॥ అనఁగఁ బునంపున ప్రణతు లర్పణఁజేసి సమర్హారీతి న
ర్చనము లొనర్చి "త్వాదృశులసన్నిధి నోరు మెదల్పఁజాలువాఁ
డనె? మిమువంటివారల కడల్గొనువత్సలభావమే తరిం
పను సుగతిం జరింపను భ్రమల్బెడఁబాపను నాకుఁబ్రాపగున్॥ 294

## ——♦ భారవి దిగ్విజయ యాత్రాకథనము. ♦——

క॥ నావుడు జటి "విద్యకలిమి
కీవినయము వన్నెవెట్టు నింపయ్యె బళే!
నీవామగధ న్నృపసం
భావన మేరీతిఁ గాంటి పలుకుము వత్సా!॥ 295

మ॥ అన "సర్వజ్ఞులు మీరెఱుంగనిది కద్దా? సత్కృపాదృష్టిపెం
పున నేఁజెప్ప వినందలంచుటలు నాపున్నెంబ, స్వోత్కర్షగా
ననుకోకున్నఁ ద్వదాజ్ఞఁగైకొని తదీయాస్థానిలో నాఁడు క
ల్గినసర్వంబును విన్నవించుకొనెదన్ గ్లుప్త ప్రకారంబుగన్॥ 296

తే॥ అధ్యయనమెల్ల పరిపూర్తి యైనపిదప
గురులసెలవొంది నామామ కూడరాఁగ
దేశదేశసభాస్థలు త్తిరిగి తిరిగి
చేరుకొంటిమి మగధ కా యూరిలోన॥ 297

మ॥ మజిలీచేసి తదీయపారిషదసంపచ్ఛోభ దర్శించు ని
చ్ఛ జనింప న్పురవీధుల న్వెడలి సంచారంబు సల్పంగ నొ
క్కజమీందారుని ప్రాంగణంబునను మూఁకల్గాఁగ విప్రోత్తము
ల్ప్రజలు న్నిల్చుటఁజూచి యందొకఁడు తెల్ప న్హేతువాలించుచున్॥

మ॥ నిలువ న్లోపలినుండి వీనులఁబడె న్నిర్ణిద్రరావంబుతోఁ
"బలుమాట ల్వచియింప నేమిటికి సర్వజ్ఞుండ నేనంచు నిం
దుల రాజేంద్రనియుక్తపీఠమునఁ దోడ్తోనిల్చుచున్నాఁడ ధీ
బలవంతుల్గల రేని రం డిదెసవా ల్వాదింపగావించెదన్!" 299

శా॥ ఈగంభీరవచోవిరావ మొకమాఱిమ్మాఱు మమ్మాఱుగా
సాగ న్మామనుజూచి వారికడ నుత్సాహంబు గుర్తించి "యే
మీ! గర్వోక్తి! సభాసను ల్పలుకరేమీ! మాఱుమాట! న్బళీ!
యాగన్జాలుట కొక్కపండితుఁడు లేఁడా"! యంచుఁబ్రశ్నించినన్॥

ఉ॥ దాపుననున్నవారు కనుదమ్ముల నబ్బురము న్భయంబును
న్దోఁపఁగ నోటిపైనఁ దమదోయిలులుంచి 'కుమార! యింతలే

నీపగిది న్ప్రశంసింతువె? మదేభముఁజూచి మొఱుంగుకుక్కచే
నేపని నెగ్గు సాహసముచెత్తకు' మన్నలహా వచింపఁగన్॥ 301
ఉ॥ "ఆఁచి యిటు ల్లనుం జడియనాడెద రేటికి? లేవె భూమిపై
తేఁచులు మత్తనాగములు తెచ్చవడ న్జరియింప? నీసభ
న్నేచి సవాలు నందుకొనలేనియశక్తుల మ్రోల భీతవా
చాచతురత్వము ల్మనవిసల్పుఁడు నాకడఁ జెల్లవీచుడుల్' ॥ 302
మ॥ అనుమ న్నోనికి నేనుమామయును ధైర్యస్ఫూర్తిమై నేగుచుం
డినచో 'మేల్భళి' మాటలేమిటికి? హా! ఒకొమ్ము!' డొకొక డిం
దునె నీహెచ్చని 'పెద్దవానికిని లేదో బుద్ధి?' యం "చేల? హో
యిటఁబోనిం దెలుఁగంగ శక్యమగునే యేపుట్ట నేపామొకో?"
మ॥ అని చుట్టుంగలవారు పల్కుకొన నిమ్మాగుబ్బునాలించి తెఁ
డిన దీప్తిస్ఫుటదృష్టి నంపుఁగనఁగా "నేమేమియాస"ద్దటం
చును నందున్నప్రధాని వాకొనఁగ'నుసో!' త్రొక్కరాచేయి వీఁ'
డనువారిన్ శమియింప వేడి సభమధ్యంబందు నుచ్చైర్ధ్వనిన్॥ 304
శా॥ "ఓరాజేంద్ర! సదస్యులార! సభలో నుద్దండుఁడై యీఘనుం
డరీతి న్వివదింపఁగోర మునుపై యిట్లింట న్యాయంబె? ధై
ర్యారంభంబున నెత్తికోల్కొనిన గెల్పన్మాటలేకున్న నీ
సూరిశ్రేష్ఠుని కీర్తి నల్వురకు మచ్చు ల్చూపఁగాఁ బోలదే? ॥ 305
మ॥ ఉరకే వజ్రము వజ్రమున్నను దదీయోత్కృష్టత ల్తోఁచునే?
కలకు న్సానల దాఁచి తేర్చికొనినంగాదే మనోజ్ఞంబులై
పరఁగు న్దత్కళ లన్నిదిక్కులను, దద్వాదంబుఁ బాండిత్యము
న్మఱియున్వెల్గుత వాదఘర్షణముచే మాన్యుల్ప్రశంసింపఁగన్॥ 306
ఉ॥ పెద్దలు నానమస్కృతులఁ బ్రీతిగ్రహించి యనుజ్ఞనిందు' నా
నోద్దిక రాజు నన్బిలిచి 'యోయి! వటూత్తమ! నీదుసాహసం
బద్దిర! మెప్పుఁగూర్చె!', వినయంబును ధైర్య మెసంగునినుడు
ల్మగ్గలఁగొల్పె, నీవసతి పుట్టుక నామముఁ దెల్పదే?" యనన్॥
చ॥ అడఁకువతోఁ 'బ్రసాదమని పాదలనంచి యొఱుంగఁజేసి 'నా
యొడయఁడు మేనమామ దెసలొత్తెడి దివ్యయశోవిశాలుఁ డ

తఁ డనుచుఁ జూప నంతికపథంబున నాసనమిచ్చి "మేలిబా
పఁడ! భవదీయశిష్యుఁడు వివాదముపూనెడు సమ్మతించితే? " 308

క॥ అని భూపాలుఁడు తన నడి
గిన 'నవధా'రనుచు మామ "గెలుపోటమి వా
దనమునకు మున్నె యెఱుఁగ
జ్ఞను నే ఫలితమునఁగాక సౌజన్యనిధీ!॥ 309

ఉ॥ తాము వినోదమంచు దయఁదాల్చి యనుజ్ఞనొసంగఁ బూని యు
ద్దాములు తీవ్రవాదములఁ దద్ద స్వశక్తులఁ గొల్పి యింతలో
నేమరగింత్రు నీసభికహృద్వనజంబుల మధ్యవర్తియై
యేమహితుండు నిల్చునొకొ యేర్పఱిపింపుఁడు రాజసత్తమా!"॥

క॥ అనిన మహీపతి యన్నియు
ననువుపఱుప వాదకునకు నభిముఖముగ నా
సనమున నాసీనుఁడనై
మును గురుదేవాభివాదములు ముగియంగన్॥ 311

క॥ "విద్యాఘనపదమునకౌ
నుద్యోగమునందె యెదురునూనెదఁగా కో
సద్యశ! యితరంబుల న
స్మద్యజనార్హుఁడవు కొనుము సన్నతినార్యా!॥" 312

మ॥ అన యోగ్యుండగునామహాత్ముఁడును నాకాశీస్సులన్పల్కి, వా
దనము న్పూనఁగ సప్తరాత్రముగ నత్యంతంబుఁ దీవ్రంబుగాఁ
దనరె న్దర్కము సర్వశాస్త్రముల నంత న్మధ్యవర్తిత్వమూ
నినవా ర్వాది చలించుటల్కని కడు న్నిష్పాక్షికాంతస్కులై॥ 313

క॥ వాదిదెస స్ఫురికింపఁగ
నాదివ్యుం డోటమిని మహాశాంతుండై
'భూదయిత పిట్టకొంచెమె,
వాదిముఖునమొయ్యెఁ బ్రీతిపడె నామనముఁ'॥ 314

క॥ ఒకఁగుఁడు సర్వజ్ఞత్వం
బసదెఱుఁగని యితని' కనుచు నాపీరముపీ

డి సనన్లేవఁగఁ దత్పా
దసమీపంబునను నేను దండం బిడుచున్॥ 315

మ॥ "తొలుత న్దల్పితిఁగాదె మాదృశుల కెందు న్వందనీయు ల్మహా
త్ములు మీరంచును వత్సలత్వమునఁ బెంపుంజూపి నాకోర్కి మీ
రలె సర్వజ్ఞపదంబునన్నిలిచి యీరాజన్యుని న్మమ్ము స
భ్యుల సంతోషతరంగితాత్ములుగ సల్పుం"డంచుఁ బ్రార్థించినన్॥

ఉ॥ రాజును మెచ్చి యిర్వురము రంజిలఁ గానుకలిచ్చి పంపె న
య్యా! జటివర్య! చిన్నతన మప్పుడు, విద్యలఁదేజిక్రొత్తయా
టాజయువాంఛ, యాకుతుక, మాగడుసుంగొని కాలుఁద్రవ్వుట
ల్గాఁజనె నాఁటిఘుస్రములు, గర్వము సర్వమునున్ క్షమింపుఁడీ!"॥

క॥ నాఁగన్, "క్షమియింపఁగ నిం
దేగట్టివచేతకలిగె నేయీడున కా
రాగవియోగవిరాగవి
భాగద్యోతనము ప్రకృతిబాటయెకాదే!"॥ 318

క॥ అని కృతకముని వచించిన
విని జననీజనకు లెచటవెలయుచురో క
న్గొనఁగోరి "యోగివర! మీ
రనయము దేశములఁ దిరుగుచుట్టిర కారే?॥ 319

క॥ నాతలిదండ్రులు యాత్రకు
నై తరలినదాది వార్తయందదు వారి
స్థితాపునఁ జెలఁగుదురో
కో! తెలుపన్దగిన నంతయుం దెలుపుము రే?" 320

క॥ అని భారవియడిగిన "నేఁ
గనియెఱుఁగన్వారి, నైనఁగానిమ్ము తన
ర్చినదివ్యదృష్టి నిఖిలం
బుచుజూచి వచింతు" నంచు మునివరుఁడంతన్॥ 321

ఉ॥ కన్నులు మూసికొంచుఁ జుబుకంబు నొసల్మకుఁదాఁకునట్లుగాఁ
బన్నిన జుత్తిలి న్నిడుపుశ్వాసముతో నొకకొంతసల్పి, క

న్గొన్నసమస్తముం బలుకఁగూడను కొంతవచింతు వారు బం
దిన్నలువొందువా ర్మగధదేశమహానృపుదివ్యశాలలన్॥ 322

ఉ॥ వారలయాస్తి-సంతయు నృపాలునిచే హరియింపఁగాఁబడె,
న్నారుఁడు మింటినత్తమునఁ గొర్కు-ఘటింపఁగనాగె నేబయ
ల్దేఱఁగఁబోలు మీఁదిమజిలి న్బసయేర్పడెఁ బోయివచ్చెదన్
ధీరుఁడవివు పొందుము పదింబదిగా శుభసౌఖ్యసంతతుల్"॥ 323

## భారవి తాకట్టునిమిత్తము శ్లోకమును భార్య కిచ్చుట

క॥ అని మాయాసన్యాసి చ
నిన భారవి చింతపడుచు నిలుచునెడకుఁ జే
రెను లక్ష్మి యిరువురును మం
చెనుజేరి సమర్థాకృతులు చెల్లినవెనుకన్॥ 324

మ॥ తలిదండ్రు ల్చెఱనొందనేలనెడి చింత న్దాఁబరధ్యానుఁడై
కలఁత న్లోఁబడు భర్తమోముఁగని శంకాగొన్నచిత్తంబుకో
పులఁ దా నప్డుగందలంచినది త్రోపుంజెంద దాపొంది యా
జలజాతేక్షణ కంటనీరొలయ స్వస్వామి న్విలోకించుచున్॥ 325

ఉ॥ "ఎంతటికష్టమేని సహియించి భరించుచు నవ్వు మోముపై
గంతులవార్చు మీ రిపుడు కప్పున నాస్యముమోడ్చి యీగతి
న్జింతిలనేల? కాళులును సేతులునొచ్చెనె? కాఁకదాఁకెనే?
మంతనమేమి? తెల్పరె? ప్రమాదము లెయ్యెడనేని సోఁకెనే?॥ 326

ఉ॥ సేమమె యత్తమామలకు? చేరిరెయింటికి? సర్వబాంధవ
స్తోమ మనాకులంబె? దొన దొడ్డి పసు ల్వయి రెల్లభద్రమే?
మీఁముఖచంద్రుఁ డేమిటి కమేయసుధారుచి నింప కార్తిమే
ఘామసమావృతి న్గనియె నయ్యది సుంత యెఱుంగఁబల్కరే?॥"

క॥ అన రానినవ్వు పెదవిగొ
నను సుంతకదల్ప నతఁడు "నాతీ! సంపం
బును దైవకృపనెగడు నై
నను నీనోములకు సాధనం బెటులొనో?॥ 328

క॥ దానికిగా యోజించెద
మానఁదగునె గరితలకును మంగళకరము
ల్కాని మిష్టాశ్లోకము కును
నైఁబిడుచు పెద్దబేరి నడుగుము ధనముఁ" 329

క॥ అనితాఁటియాకుముక్క
'స్గాను'మని భారవియొసంగ గుబ్బతిలుముదం
బున విప్పనొంకుముఖమున
దానుకు విచారమున మగనితో నిట్లనియెన్॥ 330

ఉ॥ "ఇంటికొ మేనమామకొ మఱెయ్యెడకో యొకచీటివ్రాయఁగా
వెంటనె సొమ్ము రాదె? పృథివీపతుల న్దరిశింపఁ గూడదే?
పంటయొ? చేనొకో? నగలొ? పండితవేద్యము దీనినాణె మా
తంటలమారికోమటి కెద న్దగులన్గలదొక్కొ మూఢుఁడీ! ॥ 331

క॥ సంచారమరిగి యన్నలు
సంచులతోవచ్చుచుంద్రు, సకలవిధములం
దెంచఁదగుసూరు లిరలు
సంచారముసేయ భాగ్యశాలులుగారే? " ॥ 332

క॥ అన "ముగుదా! వినుమిా! యా
చన పైపైనున్నదే? భృశంపులనుభవం
బునఁగాని సాధ్యపడ దా
పనికి న్మర్యాదవిడిచి వాల్పవదమనన్॥ 333

సీ॥ అప్పుచేపుటకుగా నాఁడూఁడ దూఁటున
ట్లోకచోట హాఁయుక్తి నూనవలయు,
వృష్టికై యభిషేకవిధి శివు న్గొల్చున
ట్లొక్కట నుపహార మొసఁగవలయు,
చలిదొరఁగిలిగింత శశికాంతము ద్రవించు
నట్లొంట సరసోక్తులాడవలయు,
క్షీరంబున న్వెన్నఁ జిల్కు నైకొనుభంగి
నోరయుపాండిత్య మొండొకట వలయు,

తే॥ నెవ్వ రెట్లీసడించిన, నేమియనిన,
నుడికి పొంగని పెనుశాంతి యుండవలయుఁ,
గాని-చో యాచకున కేమగడయుఁగలదె?,
దానవాహిని నుపనదు ల్దరియఁగలవె?॥ 334

చ॥ అది యెటులున్న, నే నెచటికైనను బోవఁగరామి, నేఁటి కి
య్యదియె సమర్థ్యాకృత్యము, బెహారి ధనంబును దప్పకిచ్చు, ని
య్యదనున కెంతకావలయు నంతకు మించి కొనంగఁబోకు, మీా
కుదువ యిదేల? యిత్తు నెదికోరిన' నన్ను గ్రహింపఁబోకుమీా''॥

—♦ శ్లోకము ధనపాలుకడ తాకట్టగుట. ♦—

క॥ అనిచెప్పి పనుప లక్ష్మియుఁ
జని 'నాలుగువారములకు సరిపడుధన మి'
మ్మని శ్లోకముఁ గుదువగ ని
చ్చిన వైశ్యోత్తముఁడు చింతఁ జిడిముడిపడుచున్॥ 336

ఉ॥ "దుర్విధి యేమిచేయదు?, చతుర్జలరాశిపరీతభూపులే
పూర్వ మనేకకష్టములఁ బొందిరి యీాతనిపాటు వింతయే?,
సర్వముఁ గ్రమ్మఱ న్విధియె చక్కనఁ జేసెడిఁగాత, బాస నా
కూర్వముగాఁగ నడ్డపడి యట్టిటునా వెరవీయ దెట్టులేఁ॥ 337

ఉ॥ ఏక్షితినాథుఁడేని నెను రేగి నతి న్గొని తెచ్చి ప్రీతిమై
నక్షరలక్ష లీయఁదగునట్టిది యద్దిర! శ్లోకమిద్ది, భ
వ్యక్షయ మెన్న కేకొలఁదిబత్తెమొ యెట్టులొసంగువాఁడ?, నా
దక్షునియాజ్ఞ నేమిగతి దాఁటెడివాఁడనొ?, యేదికృత్యమో?॥ 338

క॥ మనమున గునగునఁ బెనఁగొని
నినుపెనసినవనటఁ గను వణిజు వెనుబాటు
న్వనిత కని 'ధనము నొసఁగఁడొ'
యని యనుకొని చిన్నఁబోవు నంతటిలోనన్॥ 339

ఉ॥ చందుగుపెట్టెయందుఁ గలసంచుల నొక్కటిఁ దీసి, "తల్లిరో!
యింద"మటంచు ముందునిచె హెచ్చినభక్తిఁ గిరాటుఁ, "డారి! నా

కెందుల కింతసొమ్ము?, కల, తెమ్ము. ఒకనాల్గువరాలుమాత్ర మీ
యందగు" నంచుఁ గైకొని గృహంబునకుఁ గేగెను దక్షిణమ్మతోన్॥

క॥ ఆమగని కీసతి కెంతొ,
నీమాదిరితుష్టి తమకమెనయమి కలదే
సామాన్యులకడ?, ధనమెం
దేమెయి నబ్బినను గొనుటయేయగుఁగాదే?"॥ 341

తే॥ అనుచు, నాసార్థవాహుఁ డత్యంతముదము
నొంది, శ్లోకంబుసీతికి నొప్పఁగాంచి,
యెన్నియోమార్లు చదివి, పొందెన్ని, రొండి
నున్న పీడెంపుబరణిలో నునిచికొనియె 342

క॥ అక్కలతో వదినెలతో
నెక్కువవేడుకల నోము లెల్ల ముగియఁగా,
నెక్కడివా రక్కడికే
గ్రక్కునఁజనఁ, గాల మొక్కగతి జరుగంగన్ 343

చ॥ పరగడచేనిలోఁ బవలు బంతుల నూరిచి తూరుపెత్తఁగాఁ
గొరవడ, గింజగాదములకూడిక, ధాన్యముఁ, గళ్లమందుఁ బ
ల్తెఱఁగులనుండఁ, గొన్ని నిశిఁ దెక్కలికాండ్రు హరించి, భారవి
న్బిఱుసుగఁ గాళ్ళయి న్గలిపి బిగ్గబిగించి, యథేచ్ఛనేగిరన్ 344

క॥ మఱునాఁడు వేగ మామయు
మఱఁదులు బావలును గైలు మళ్లింపఁగ నం
దరుదెంచి చొప్పగుడిసెకుఁ
దరిగాఁ బగ్గములకట్టు దసలనివానిన్ 345

ఉ॥ భారవిఁగాంచి, కట్టులెడఁబాపి, యదీను నొనర్చుచు, న్సమా
చారము నాలకించి, కడుజాలి నలందురి, వాని నింటికి
న్జేరఁగఁ బంపె మామ, యటఁజెల్లిన సర్వమెఱింగి యత్త కో
పారభటి న్జిఘీయను లయ ల్వెలయింపఁగ సాగెఁబెల్లుగన్ 346

తే॥ అదియదృష్టమొ దురదృష్టమగునొ, లక్ష్మి
వాకిటన్జేరెఁ గ్రిందటివాసరమునఁ,

గాన భారవి కత్తయే బోనమిడుట
సంభవించెను నాటిప్రారంభవేళ 347

చ॥ గలగలలాడుచు, న్గసరి కాలుబుప్రేలుచు, 'ఛీ'లఁగొట్టుచు,
న్గలవియు లేని వెప్పటివొకైకొని దెప్పుచు, గొణ్గుచు, న్విశ్రం
ఖలమగు నాశువు న్గొలిపి, కత్తరగగ్గురు దిమ్మటల న్బవ
త్రిలఁగ నొనర్చె శ్వశ్రువు, విదీర్ణమనంబున లక్ష్మి పొక్కఁగన్ 348

శా॥ "అమ్మా! దొంగలు దోఁచుకొంచుఁజన నన్యాయంబుగా నేల తి
ట్టిమ్మెం దిట్టెద?, విందు మాయునికి నీకిష్టంబుగాకున్నఁ బో
పొమ్మంచుం దెలుపంగరాదె విదిలింపు ల్దుంపలు నోళ్లతోఁ
గ్రమ్మ న్నాసదమ్ము వంటఁబట్టువె? తినంగాఁ దోఁచునే యేరికిన్?"

మ॥ అనఁగా మంట ఘృతంబురీతియయి కోపావేశముం బెంప "నే
మనెదే? దొంగల! నాఁడునాఁ డెపుడులే రయ్యారె నేఁ డీవనికై
మనకై వచ్చిరె? నోముసేఁతబుణ మీమార్గంబున న్దీర్పఁ బ
న్నిన పన్నాగముగాని, పోఁదలఁప నేనే యుండుమంచాటినే? 350

ఉ॥ పాపము! సైఁపదే మెతుకు?, వచ్చికచుంగొను పోతరాజు నా
నేపగిది న్గసించెడినొ "యింతకునింతగ!" నంచు నంబలి
న్గోపన త్రిమ్మరించె వడిఁ గూడుచుగట్టయుఁ జుట్టుఁబాఱి "న
త్తా! పరమాత్త విప్పటికి నైతిఁబునీతుఁడఁ బోయివచ్చెదన్ 351

చ॥ కొనుమివె నూరువేలు సమకూర్తు నమస్సులు, కాశి నేగురుం
డును దయసేయలేనిది కడుంగడుముఖ్యము యోగ్యమైన దీ
యనుభవ మబ్బె నీదరి నిఁకవ్వల సంస్కృతి నెట్టిచిక్కునై
నను నెదిరించి తీర్చెద, ఋణం బెట్లతీర్చెదనమ్మ నీకడన్?" 352

మ॥ అని సంతోషముపొంగు లాస్యమున నాట్యంబాడఁగాఁ జేతిమూ
తిని గాళ్ల న్శుచిఁజేసి శ్వశ్రువున కెంతేభక్తి సాష్టాంగవం
దనముంగూరిచి మామ కెల్లరకుఁ దత్తద్యోగ్యమర్యాదల
న్వినుప న్దెల్పి ప్రయాణమయ్యె సతి నందే నిల్వ శాసించుచున్ 353

ఉ॥ "ఇచ్చట నింక నొక్కక్షణమేనియు నిల్వనెదెట్లుపోయిన
న్వచ్చెద మిమ్ముఁగూడి, పతిపాదసమర్చన మెట్టిసాధ్వికిన్

నచ్చిన జీవనౌషధము నన్నిటనిల్పుట దావవహ్నిపా
ల్పుచ్చుటసుండు నద్దఱుమఁబోకుఁ డెఱింగియుఁ దద్ఘనార్తికిన్" 354

ఉ॥ కాంత యిటుల్వచించుచు వగన్గొన భారవిపల్కె "బేలవై
యెంతటిమాటలంటివె సఖీ! మనపెద్దల దిగ్గఁబాల్గొ ధీ
మంతులఁజేసి చేయుఁడని మాన్యులఁగా మనల, న్గ్రహింపుమీ'
చింతఁ ద్యజించి తల్లికడఁ జెంగటను సమ్మతి నేగుదేఁగదే॥ 355

మ॥ అనుసంభాషణమంతయు న్విని మ మ్మెల్లఁబ్రాపుటాందోళ మూఁ
ప నెద న్బుట్టుదిగు ల్కలంప నె దెసన్ బాల్పోక స్తంభమ్ముకి
తిని నిల్చుండిన తల్లిఁ గాంచి, 'జననీ' దీవించి మాకేగ నా
జ్ఞ నొసంగంగదె మీకుమాకు సుఖము ల్సంధిల్లు నత్యంతముక్

మ॥ అని యాకూఁతు వచింపఁదల్లి యను "నోయమ్మా! దినంబట్టు లం
టిని ప్రాప్తించిననష్ట మాత్మఁగలఁప న్మిశ్రేశ్వఁ డిటు ల్ప్రాప్తవ
ర్తనముంబూని తెగింతురం చెఱుఁగ, నితంద్రిడి న్నిరీక్షించి, యా
యనయాన న్బొనరింపుఁ డేనెవతె నిం దాఁగానున మానినీ!" 357

మ॥ అనుచుండ న్గృహి యేగుదెంచి సకలంబాలించి 'జామాతృదు
ర్దినము ల్మాసెను నేఁటితో' ననుచుఁ దృప్తిం జెంది, 'యార్తి న్నిశ
ల్దనువెల్లం బొగులం గనుంగొనక వంతంగొల్పితే?' యంచు భా
ర్యను గోపించి, "బహిష్ఠ నేఁడెచననేలా' యంచు వారించుచున్॥

తే॥ కూఁతునకు పునితయగు వెన్క నాతఁడనిచె
నిరుపుర న్నారెఁ దగురీతి నిచ్చి, వారుఁ
గతిపయప్రయాణములపైఁ గాశిఁజేరి
రచట భారవి మాతులుం డబ్బురపడ॥ 359

—♦ భారవి తల్లిదండ్రులకొఱకు పయనమగుట ♦—

క॥ 'ఓకీ! యల్లుఁడు' యని 'చి
ట్టీ!'రమ్మని ప్రేమ మెయి నటింపంగ నమ
స్కారములకు దీవన లిడి
గారవమున గృహియు గృహిణి కౌఁగిలిఁగొనుచున్॥ 360

క॥ "మీయయ్యయు నమ్మయుఁ దమ
కేమెడల న్దోఁపరనుచు నీనడుమ భవ
జ్జాయాజనకుఁడు, నీసఖుఁ
డీయామెడ నెమకి రింటి కేతెంచిరె?' నాన్॥ 361

ఉ॥ వచ్చెనుమామ, మద్గురులవార్త నొకింతయుఁదేఁడు, వింటినే
కచ్చనొ మాగధేశుఁ డరికట్టెను వారలనిం, చనుజ్ఞ మీ
రిచ్చిన నేఁడెసాఁగి యటకేగెద" నంచువచింప నల్లుతో
'వచ్చెద నేనుగూడ నరపాలుఁడు సౌమ్యుఁడు చింతఁదక్కుమీ!'"

క॥ అని మేనమామ నుడివిన
విని భారవి పలికె మీరుపెద్దలు మార్గం
బున నెడ తెగక కలుగు కను
కనులకుఁ దాళుకొనలేరు గడెసేపయినన్ 362

క॥ పోయెద నాసఖుఁడగు నా
రాయణభట్టరును గూడిరా, నేకతము
న్రాయలు కాంచి పితరుల
న్దాయనిడెనొ యెఱిఁగి కూర్తుఁ దగునేకతమున్॥ 364

క॥ అనుచుఁ గవి మంచిమూర్తం
బున వెడలి వనాళి శిలల మూర్తంబును, ముం
డ్లనుగండ్ల మిగులఁబూర్తం
బునగునడవ నలఁత మేనఁ బూర్తంబుఁగనన్॥ 335

క॥ ఒకకొండబొఱియచఱియ
న్దెక తెకమెగురులను బుగులు తెలిసెలమేట
న్నుకముగ డిగి మొకముఁ గడిగి
తుకతుకవడిసెడఁగఁ ద్రావి త్రోవరి దరిగన్॥ 366

క॥ అరవిరుల న్గిరిదరులం
దురుతరుల న్దొరలుసిరుల నొగిమెరమెఱఁదె
మ్మెరపురుల న్సరిసరుల
న్పరిసరముల నొరయురుచులఁ బరిమళములలోన్॥ 367

క॥ కుతుకాన౯ గుతుకాన౯
గుతిమాన న్దాఁకి దూఁకి గునికి గునిసి తేం
ట్లతిహాళి౯ లతికాళి౯
ధృతిఁ బాళి న్దేనెనాను దీనుసములలో౯॥ 368

మ॥ సెలయేట న్వలిసీటిజిల్లువలుల న్జేయూ తమై వాత మా
కులపా టాకులపాటుఁ గల్గనినడ న్గూర్పంగఁ దేర్పంగఁ ద
మ్ములచాట న్వలిచోటఁ గద్దదికల న్మోరెత్తి మాఁరొత్తు హం
సల నీటుంబులుపాటలందలి విలాసశ్రీలసత్కేళికిన్॥ 369

ఉ॥ హారిగిరీడ్దరీఝురి నహార్యనిలీనగురుప్రపాతతీ
వ్రారభటీసముద్ధతనిజాంబువు పింజరితాచ్ఛవర్ణడిం
డీరకణాళిఁ జిమ్మఁగ వడి న్జిరుచేపలటంచు మూఁగువీ
డ్వారముతోడఁ దేంట్లు నిగుడ న్వెరికొప్పెడినట్లు తోఁపఁగన్॥ 370

క॥ కెలకుల నొత్తుగఁ దరుశా
ఖలచివరలు నీటి నంటఁగా వ్రాలుచుఁ బై
శిలనుండిచూడఁ దటినీ
లలనాసీమంతసీమలాగున వెలయన్॥ 371

చ॥ విరిపొడిఁ గొల్లలాడి, ఖగబృంగరుతు ల్గిలుబాడి, వాహినీ
వరహిమసారశీకరలవంబులఁ జుబ్బనచూఱలాడి, ప
య్యెర నెఱనీటుగోటునడ నాడుచుఁ దావులఁజిమ్మ రాగము
ల్పఱపఁగ జల్లుఁజల్ల మరు వైఖరిఁ గూర్చెడి యాత్మశాంతికి౯॥ 372

మ॥ తనయుద్యోగమెకాక, కొంతవడి, కాతం డంతయు న్విస్మృతి
న్మనుఁగ, న్దాఁగునికె, న్వశాలశిలపైభూజంబునీడ, న్నదీ
ధ్వని 'జో-జో' యనుపాటయై యతనిచిత్తం బూఁపి జోకొట్ట, న
య్యనికి న్నిద్రమునుంగకుండుట కెవం డోపు న్ధరామండలిన్॥ 373

చ॥ ప్రకృతి కడున్విలాసవతి, భారవి నట్టులునిద్రపుచ్చి మే
ల్సుకము నొసంగుచు న్దిరిగిచూచినచూపునఁ జూపుమేర నిం
కొకఁ డగుపింప నంగరుచియు న్దరహాసము నూర్పుకూర్పుతో
సకలమునింపి యాతటినిచాయకు నాతని లాగె మెల్లఁగన్॥ 374

మ॥ తరువృతంబులవీవన స్గుసుమసంతానంబుగంధంబుల
స్సరిదద్రిద్రుమసత్ప్రథాభల విహంగశ్రేష్ఠగానంబుల
న్సురుచు ల్గొల్పుఫలోదకంబుల శ్రమల్బోక్కంగ నేర్దాఁటి యి
ద్దరికిజ్జేరి యతండు తా మఱలపూఁతనొవ్వ నుంకించుచోన్॥ 375

మ॥ కనియె న్ముందట రాతితిన్నెపయి వృక్షచ్ఛాయఁ గేల్దిండుగాఁ
గొని మైవిస్మృతి నిద్రవోవునరు, "నాకుం ద్రోవఁ దోడౌను వీఁ
డును నావైపున వచ్చెనే" ననుచు గండుద్రాతఁ గూర్చుండి, యు
స్సున నీనిద్రితుఁ డేల లేవఁ డనుకొంచు న్మోము నీక్షింపఁగన్॥ 376

## ♦ భారవి నారాయణుల సమాగమము ♦

మ॥ చకితుండై "యెవరిం గనుంగొనెద? మజ్జా! భారవీ!" యంచుఁ జెం
తకు దూఁకుంగొని తట్టిలేప, నతఁ డుత్సారంబున న్దుల్లి నీ
ల్గి కనుల్విప్పి, భయంపుఁజూపులొలయ, స్సిగ్గాడితెల్వి న్గ్రహిం
పక, యొక్కంతకుఁదేఱి, జ్ఞప్తినిగుడ, న్స్వాస్థ్యంబు సంధిల్లఁగన్॥

క॥ "నారాయణుఁడా!" యని పొం
గారి న్బిగికౌఁగిలి న్మహానందంబుం
జూఱఁగొని "నెమకుతీవియ
తారె న్బాదములఁ గడుముదంబయ్యె సఖా! 378

ఉ॥ ఈనడుమ న్యతీంద్రుఁడొకఁడేఁడొ కనంబడి, 'యాస్తినెల్ల భూ
జాని హరించె, యాత్రకయి చన్న, భవజ్జనకుండు మాతయు
న్బోనున నున్నసింగములపోలికగా మగధ న్జైఱ న్గడు
స్దీనత నున్నవార'నుచుఁ దెల్పిచనె న్నిజ మీవెఱుంగుదే?" 379

క॥ అన దొనకఁదొడరు చిఱునగ
వున వగ చొఱఁ బెదవులదరఁ బారి రదనరుచు
ల్మినమినమన నారాయణుఁ
డనె "జటియుం దబ్బరాడునా? నిజమె సుమీ!" 380

చ॥ బడికొనసాఁగ నీగృహము బంట్లఁ బోలంబుల నాదునేట్పవెం
బడిఁ గనుఁగొంచునుండ నొకవాసరమం దెడలేని గొప్పచ

ప్పుడు లొంగి నుప్పతిల్లి యురువుంగొని యార్ద్రజేయంగ, దండో దోఁ
పిడిపెనుగుంపా! యంచుఁ బ్రజ భీతిలి యాతురులై చలింపఁగన్॥

ఉ॥ "ఈగతిఁ జుట్టిముట్టి యెడమీయక యూపిరిసల్పనీనియు
ద్యోగములొప్పఁ బైఁబడుదు రో ప్రజలార!" యటంచుఁ జాటున
న్లాగున గాలివాలున బలంపుటలల్కొని ముందె యూరిపై
మూఁగె దళంపుధూళి పెనుమ్రోఁతలు నూతములై ధ్వనింపఁగన్॥

చ॥ అని వచియించుచుండునెడ, నాపెనుచట్టున కవ్వల న్దమం
తనఁజను యోధులిర్వురకుఁ దద్ధ్వని వీనులసోఁకి కౌతుకం
బును బెనుపంగ, గండుశిలముట్టెకుఁజాటున గాలితిన్నెలన్
దనువులవాల్చి వీనుపిఱుఁద న్గరసంపుటినుంచి విన్కొనన్॥ 383

శా॥ ఆనారాయణుఁ డిట్లుపల్కె, "సఖుఁడా! హస్త్యంబుధు, ల్వల్గదా
జానేయాబ్ధులు, తేర్లసంద్రములు భాస్వజ్జ్యాచమూవార్నిధు
ల్గా నానాబలము ల్తనున్గొలువ నుగ్రస్వైరసంచారియై
యానాఁ డక్కడఁజేరె హూన్నకులవిఖ్యాతుండు దుర్జాతుఁడై॥ 384

చ॥ అహహ! జనంబుల న్జనకుఁడై దయ దీనులకాశ్రయుండునై
బహుకవిమాన్యుఁడై నుతికిఁబట్టగు మాళవవీరధర్మభూ
వహు నొకతోరమానుఁడనువాఁడు పరాజితుఁజేసె వింటివే?
మిహిరకులుండు తత్సుతుఁడు మిత్తిపరాకృతిసుమ్మ!'' నావుడున్॥

ఉ॥ "ఓడెనె? వీరధర్ముఁడె? డొహహాహా! దురదృష్టము! నాదుపాండితి
న్నాఁ డతఁ డెంతయోతనిసి నన్దనిపె, న్గుణశాలి, యేఁడను
న్నాఁడొకొ నేఁడు! దొంగలుకొన న్వెడె వానియశోధనుండు నా
జాడయులేదె? సద్గతివశంబయి యుజ్జయినీ! కృశించితే!"॥ 386

—♦ భారవికి మాళవయువరాజ పరిచయము ♦—

మ॥ అనుచు న్భారవి యంగలార్ప శిలచాటైయున్న యోధద్వయం
బున బ్రం బెగయ న్యువానుఁడగు రాణ్ముఖ్యుండు పెన్దాఁటుల
న్గొనుచు న్వైచ్ఛశిలఁజట్టిరాఁగ నచట న్గూర్చున్నవా న్గొబ్బుగొ
బ్బున నిల్చుండిరి బిట్టుగాఁజకితులై పొంగారుదేహంబులన్॥ 387

తే॥ ఇంతలోఁ బెద్దయోధుండు నేగుదెంచి
"భయము నొందకుఁడయ్య విప్రవరులార!
వీయశోధనుగుఱించి మీ రిపుడు ముచ్చ
టించితిరొ, వారుపీరెసుఁడీ! కనుండు"॥ 388

శా॥ నాఁగ న్విప్రయుగంబు వింత ముదము న్వాసించు నాస్యంబుల
"న్బా గయ్యారె! పురాకృతంబుఫలియింప న్వీరిఁగన్గొంటి' మ
న్వాగుజ్జృంభణమొప్ప ఫుల్లనయనవ్యాపారము ల్సేసనై
తూఁగ న్దీవనలిచ్చి మైమెఱుఁగు సంతోసంబు నిండారఁగన్॥ 389

చ॥ నలువురుఁ గూరుచుండిన యనంతరమందు యశోధనుండు కం
దళితకుతూహలంబు నయనంబుల వాక్కుల సందడింప "నో
యలఘుమనీష! మాళవధరాధిపసూనునిఁ గొంచుఁబోయె దొం
గలగుమి యంటి రాగొడవఁ గంటిరొ వింటిరొ తెల్పుఁడంతయున్॥ 390

క॥ కలఁక న్గలగా నొకకథ
మెలఁగు న్మది నప్పుడపుడు మీవృత్తము నం
దులకు సరిపడినయెడల
న్దొలఁగు న్సంశయ," మనంగఁ దొడి భారవియున్॥ 391

మ॥ పలికెన్ "రాణ్మణి! దేనికో యెఱుఁగుదీప్రశ్నంబు, సందేహమెం
దులకెవ్వారికి?, మూడుమూర్తులను దద్బాభమీశునింబోలు దీ
వు, లలాటంబునఁ జెక్కుల, న్జెవులఁ, జూపు న్జేవ, నైన న్గుతూ
హలము న్దీర్చెద నాలకింపుము శ్రుతంబౌపూర్వచారిత్రమున్॥ 392

ఉ॥ మాళవదేశరాజబహుమానిత ముజ్జయినీపురంబు త
త్పాలకదివ్యసౌధములపజ్జల నందనము న్వసించుచు
న్వేళవనం బొకం డెసఁగు కృత్స్నసుమప్రదవల్లరీతరు
శ్రీల హిమాంబుపూర్ణసరసీతటసత్ఫలవృక్షపంక్తులన్॥ 393

ఉ। అందొకనాఁడు రాణి భవదంబ సుమాపచయార్థమేగి యా
విందడిసాపడిం దగిలి తామటుచె న్నినుు, దాది నిద్దురం
జెందినినిన్నుఁ బుష్పములసెజ్జఁ బరుండగఁజేసి కూర్కెౘ నా
సందున నీవు మేల్కొనుచుఁ జల్లఁగఁ జారితి వెట్లొ పిమ్మటన్॥394

ఉ॥ దాసియు నిద్రలేచి నిను దాపునఁ గానక గుండె 'జ'ల్లనం
గా "సిసువెందుఁబోయె"నని క్రంతలఁ బల్మాఱుఁ జూచిచూచి యెం
దేసవఁగాంచలేక కనియె న్నది నడ్డులజాడ నొండు నోం
డేసావలేమి లేమ చరియింపఁ దొడంగెను దానిపోబడిన్॥ 395

మ॥ అదియును దోఁటకోరడికి నవ్వలసైతము రాజిలంగ నా
సుదతి యటారయ, న్దిరిగిచూచుచు ఱివ్వునఁ బాఱుచున్న వా
నిఁ దఱుము నొక్కయోధవరుని, న్గసబ ర్వటడించి దొంగ బి
ట్టదిరిచి కూల్చి బాలు గ్రహియించి లెత్తుటఁగాంచి కెవ్వనన్॥

మ॥ అఱచెన్దాసి భయాకులధ్వనుల "వారా! వీర! రారండు స
త్వర మయ్యో! నృపసూనుఁ గైకొనుచుఁబార్వన్నాఁగి వీఁడెవ్వఁడో
యరయుం"డంచుఁ దదార్తనాదము పరివ్యాప్తంబుగా నాడకా
తురత న్వచ్చిరి రాణియు న్సఖులుఁ దోడ్తో బంటు లిర్వంకలన్॥

శా॥ ఆలోనన్ శిశుహర్త బాలకుని యంసాగ్రంబున్ గట్టి పై
న్వాలు న్నోట లగించి దాఁటె నెగుపాప్రాకార మేత్రాడొప్రా
పైలాగన్ ద్రుటిలోన, నవ్వల వను ల్పట్నంబులు న్గట్టులు
న్గాలింప న్గనరావు వార్తయును జిక్కన్రాదు పెక్కేండ్లుగన్॥ 398

చ॥ తడవులనుండి మంత్రియయి తద్దయునిద్దపురాజభక్తిఁ బే
ర్వడినయమాత్యశేఖరుఁ డవాప్తనృపాగ్రహుఁడై పదంబుఁ బో
విడచినవాఁడు నాఁటిసుత వీటఁగనంబడకుంట హర్తయా
తఁడె' యని క్రొత్తప్రెగ్గడ తదాప్తులపందఱ నుంచెబందిలోన్॥" 399

వ॥ అని ముగించినంత నారాయణభట్టారకుఁ డందుకొని యయ్యో! 400

మ॥ నిజమో! దబ్బరయో! వదంతియొకఁ డచ్ఛిద్రంబుగాఁజొచ్చె రా
ష్ట్రీజనంబుం దలనూత్నమంత్రియె దురాశచ్చాని మీఁత ద్రిన
మ్మ్రఁ జలంబాఁచిచరించి పూర్వసచివు న్మార్పించి మీవంశమె
ల్లఁజన న్దాఁబతిగాఁగ సల్పెనట వాలాయంబుగాఁ గుట్రలన్॥ 401

చ॥ పలికితిఁ గోరమానుఁడు భవజ్జనకు న్గలన జ్జయించె నం
చలఘుచరిత్ర! కాదదిజయంబు నిజంబు గడింప మంత్రికు

త్రులుఫలియింప సాగినభరంబగు దోపిడిగాని, యాత్మసే
నలె కికురింపఁ బోరనగునా పతి తొల్గక యెట్టిధీరుఁడేన్"?॥ 402

మ॥ అన జ్యేష్ఠుండగుయోధుఁ డెత్తువడునాస్యం బగ్గిరాల్కన్ను లు
బ్బెనయన్నాగడిమేనితోఁ బలికె "ద్రోహీ! నన్నుఁ బోఁజూచి యె
ట్టినికృష్టంబగుసేఁతఁ జేసితివిరా! డింభా! నృపాలాత్మజు
న్మనుపన్వచ్చితిఁ గానిచో నిలిచిత్రెంపన్లేనె నీతంత్రముల్"॥ 403

క॥ అన భారవినారాయణు
లనూనమగునబ్బురమున నతనిం గని 'యకా
ర! నిజంబె!! మంత్రులా!!! వం
దనశతములివే కొనుండు దయమీఱంగన్"॥ 404

మ॥ అనుచో నాతఁ "డిదే! వినుండు శపథం! బాదుర్జను న్వానిఁ జే
రినహాన్ని రణభూమిఁ జక్క డఁచి ధాత్రీనాథుని న్గ్రమ్మఱ
న్దనసింహాసనమందుఁ జేర్పనియెడ న్నాపేరు శ్రీభట్టుకా"
దనుమంత్రింగని పల్కె భారవిసఖుం డత్యంతనమ్రాస్యుఁడై॥ 405

చ॥ "సచివవరేణ్యా! రాసుతునిసాకఁ దొలంగితి రంటి రాకథా
ప్రచయము నాలకింప మదిఁ బాఱెడుఁగౌతుక, మర్హమైన నో
పి చెవినివేయరే' యనిన ప్రీతమనంబునఁ బల్కె మంత్రి మం
చి చెడుగు గోప్యమై నృపవిశేషకళన్దగు నైనఁ జెప్పెదన్"॥ 406

ఉ॥ నాఁగ యశోధనుండును ఘనంబగువేడ్కయు వింత మోమున
న్బాగు ఘటింప భక్తి పరవల్లువడ న్పులకించుమేనితో
"నోగురువర్య! పూర్వకథ నొక్కసుమంతయు నాకుఁ దెల్ప రా
రా! గణనీయ మోర్పుపస, త్యాగముపెంపును, రాజభక్తియున్॥

చ॥ సిరిని సతి న్సుతు న్సుఖముఁ, జింత యొకింతయు లేకవీడి, త
న్మఱచి శరించురాజుపయిన న్దనకూరిమిఁ జంపుకోక, దు
ర్భరవనసీమల న్బలుకరాని యవస్థలఁ దూలిపోక, బం
ధురమగుప్రేమ నాకయి ఘనుండితఁ డందినపాట్లనేకముల్ ॥408

చ॥ అనునెడ "నావిధి న్సలుపనైతి సమగ్రముగాఁగ, నాయశ
క్తినెకద ఱేఁడు రాజ్యదశ తీఱె వటించెదునెందొ, దుస్సమ

ర్ధను నను మెచ్చుకో ల్తగినదారియె?, యింకవినుండు పల్కుదు
న్మనుపటిగాథ, నంత ప్రభు ము న్నెమకన్జనవచ్చు నెల్లెడన్ ॥ 409

చ॥ ప్రియపడి వీరధర్మపృథివీపతి యొక్కదినంబునందు మే
ల్హాయములు జాగిలంబులు వల ల్జిగురు ల్మదనాగము ల్భటో
చ్చయములుఁ గొల్వ వేటరభసంబున ఘోరవనాంతరాళి ని
ర్భయమున సంచరించునెడ బంల్లెడయై నృపుఁ డేగుదారిలోన్॥

ఉ॥ ఘోరవరాహము న్దఱుముకొంచు నృపుండు మహాశ్వధారల
స్సారిమెయి న్గ్రమించునెడ బాటకుఁ బ్రక్కను దట్టమాపొద
న్జేరినక్రుద్ధమాపులి యుసి న్బెనుదూఁకున వ్రాలె రౌతుపై
వారువ మావడి న్ధరణిపైఁబడి గింజుకొనంగ బిట్టుగన్॥ 411

శా॥ అన్యాయత్తునిపై గబీలుసిగనా, వ్యాఘ్రంబు దూఁకంగ నా
ధ్వన్యుత్కర్ష కదాఁటు దాఁటునకు నశ్వంబుర్విపైసోల రా
జన్యుం డాహరిక్రిందఁగొంతమెయి పైనా మేనుగా నుండియున్
దైన్యంబొందక వాలుసిద్ధముగఁ జేతందాల్చి యట్లుండఁగన్ ॥ 412

శా॥ నిప్పుంగన్నులు నిల్చి ముందుసెగలై నిక్కంగ వాలంబు గు
ప్గుప్పుంచు న్జలియింప గొంతుముడుఁగ న్గుప్పించి దూఁకంగ నీ
ముప్పేరీతిని దప్పునంచుఁ గనుచూపు న్మేరవా క్రీల్పడ
న్గుప్పె వ్యాఘ్రము లక్ష్యమున్దొలఁగి యెందో వ్రాలె శూలాహతిన్॥

క॥ శూలము విసరినరౌ తట
వాలుంగొని దుమికి పొడిచె వైళమ కదలు
ల్చాలించుచు నలబెబ్బులి
సోలి జముని ప్రోలి కరుగఁ జూపఱుమెచ్చన్॥ 414

శా॥ వాఁడేడీంభుఁ డదృష్టమట్లమర రాత్ర్యాపణావనుండయ్యె, నా
నాఁడే వాఁడుపమంత్రియయ్యెను, గృతజ్ఞత్వంబు బాధింపఁగా
ఱేఁడవ్వానిని నాఁడునాఁటికిఁ గడుప్రేమించి యేలోపముం
జూడండయ్యెడఁ, బ్రేమ గ్రుడ్డిదనుచోఁ జోద్యంబులేదింతయున్॥

చ॥ అతివినయంబె ధూర్తమనుజాంకము, వాఁడును నేర్పుపొందిక
న్మతిఁగరఁగించుచు న్నృపుని మన్నన కిచ్చెను దోహదంబు న్స్వ

స్థితిగతులందుఁ బైకి నొకచిన్నెయుఁ గుట్రను దోఁపనీయ క
క్కతమున నేరికిన్ దెగువకల్గను నిక్కముఁదెల్ప తేనికిన్॥ 416

చ॥ పలికిననాపయి న్ననరువానె ధరాపతి కందుచేత నేఁ
దొలఁగితి వానిచాటుకథ తూర్ణమెఱుంగఁగ నంత నొక్క వె
న్నెలనిశ నూరిబాహ్యమున నేనిటునట్టుఁ బచేరమూను చోఁ
గలకల మేగుదెంచె నెడకల్గఁ, దదీక్షణ కేను పొంచుదున్॥ 417

క॥ వీఁడును సేనానియు నా
జాడనె యరుదెంచి రెడియె సంభాషణ మం
దాడుకొనుచుండి రొకకొం
తాడాడ న్జైవికిసోఁక నతిచకితుఁడనై॥

ఉ॥ 'ఆరెయి రాకుమారు నెట్టులైనను దొంగిలి పిల్కుమార్చిన
న్నారియొకింతయూఁదెలిపి, తప్పకొనర్పు' మటన్నఁ 'జిత్త' మ
న్నొరణి నాలకించి యెటుతోఁపక చింతిలి వీరినిప్పుడే
పోరి వధింతునా? జయముఁ బొందుదునా? యనుశంక నిల్చుచున్॥

చ॥ 'తెలిపెద రాశికై సనని తేఁకువఁ గేలివనంబుఁ జాటుత్రో
వల నపుడప్పై చేరి తెగువ న్వెలిగోడనుదాఁటి సాగ న
ప్పాలముఁ గంటి దైవకృప పూర్ణముగావిలసిల్ల నాఁడు నీ
లలితుని, గొంటి సంతయు విలంబనమూనక వాని సందిటన్॥ 420

ఉ॥ వింటిరెకాదె పైక నభీతమనంబున నాఁడె దాఁటి తే
నొంటరి వీనితో పచులు నూరలు వాఁగులు కొండ లెందునే
వెంటఁ జరించిన స్వతకువీరుల కందఁగవీక సాకె నా
దాటులదంట దైవ మలతన్ వెలితిన్ ధృతి జారకుండఁగన్॥ 421

చ॥ మిహిరకులుండు పాపురి కమేయబలంబుల వచ్చెనంటి వా
విహారణమేమి సెల్పు" మన విచ్చెను భారవిమిత్రుఁడిట్లు "స
న్నహనముమీఱఁ దొపుఁబయనంబుల సేనలతోడవచ్చి దు
స్సహము లనేకము ల్సలిపె జాలియు న్యాయ్యము మానిమారియై॥

ఉ॥ సైనముసెరుఁ దప్పి పరుషంబు మతాంతరులందెగాక యా
శైవులఁగూడఁబూ నె, ధనసంగ్రహము న్విషయార్జనంబె త

ద్భావగతంబు శైవమనువార్త నెపం బలదాడిఁగప్ప, నూ
ళ్లో! వనమధ్యసీమలయి లోఁబడె నాశిలి పీచమేమటన్॥ 423
శా॥ మాగ్రామంబున వీనిచేవెలసి సంస్త్యాయంబుగా సాగు శా
స్త్రగ్రైవేయకపారశాల యితరస్వాస్థ్యంబులంగూడె, నా
యుగ్రం బేమని తెల్పువాఁడ! ముసలు ల్యోషామణు ల్బిడ్డలు
న్వ్యగ్రాయోధను లొక్కరీతిఁ బడి రత్యాపన్నులై ఘోరముల్”॥
చ॥ అనిన యశోధనుం డనియె నాగ్రహమూఁపఁగ “మాగధావనీ
శునిపెనుధాటి నోటువడి గ్రుక్కినహన్నులు సిగ్గువీడి తెం
పునఁ దలలెత్తిరే మఱల? భూరిమదీయ పరాక్రమాగ్నిసోఁ
కునఁ దుదముట్టఁ గాలుపక కోపముడించుట పాఁడికాదిఁకన్”॥ 425
క॥ నా నారాయణుఁడిట్లను
‘నోనరపతి! మగధరాజు నొప్పవదలి యే
లో? నామిత్రునిగురుల
న్దానుంచె న్బంది వారి తప్పెయ్యదియో?”॥ 426

మ॥ అన శ్రీభట్టిటుపల్కె, ‘సత్పురుషులారా! భీతిలన్బోకుఁడీ!
మనమం, దామగధేశ్వరుండు బుధసమ్మాన్యుండు, క్రూరుండుగాఁ
డనువాకారణముండుఁ దత్కృతికి ధైర్యంబొంది మున్ముందు మా
జననాథు న్గనరం డన న్గదలి రుత్సాహంబుతో నయ్యెడన్॥ 427
క॥ నలువురు నలువురువనసీ
మల మలకల మలయు మలయమధురానిలుతా
వుల నెలవుల నెలరాచలు
వలఁ గలవగ లగల నెలమివఱల నడువఁగన్॥ 428

మ॥ ‘కెరొసీన్’ తైలమహార్ణవంబున నినాగ్నిజ్వాల వేష్టింప స
త్వరజోద్ధాపితదావవహ్నిశిఖ లుద్యద్ధూమపూర్వంబు లు
ద్ధురవిక్రాంతి నజాండచంక్రమణ ముద్యోగించె నానొప్పె నా
శరదభ్రాజిదిశాప్రపూరకమహాసాంధ్యారుణోగ్రచ్ఛవుల్॥ 429
తే॥ గీ॥ మంట లణఁగుకొలంది నిమ్మడిగ నెగయు
ధూమమనఁగఁ దమం బెందుఁ ద్రోపువడక

కడఁక నల్గడల న్నిండి పొడిచె మిన్ను
మిన్న శోకకజ్జలాబ్ధి విన్దన్ననటుల॥ 430

క॥ ఆపొగ పగలాఁగ మిగులు
ఊపున దశదిశల విరియ నెగురు మిణుగురుల్
ద్యోపథముఁ గూరి నిలుకడఁ
బ్రాపొంది వెలింగె ననఁగ భాసిలెరిక్కల్॥ 431

తే॥ గీ॥ పైసెగల్బ్రాలి క్రీఁజాయ ప్రయ్యుడంగ
ము న్నరణ్యగుహాంతరముల మడంగు
చిమ్మచీఁకటియ నెడిమషీరసంబు
పొంగె నెగురుల మిన్దాఁకఁబోవునటుల॥ 432

తే॥ గీ॥ మింటినీలిమలో సంక్రమింప నెగురు
గురుతమిస్రంబుకో ల్తలకునువడంకఁ
గొనియెనన రిక్క లాకసమునను మినుకు
"నుద్ధతుల మధ్యమున బీదలుండఁదరమె" ॥ 433

తే గీ॥ ఆకసమునల్పు గెల్చునక్షత్రక మూల
బలములన్గొని చీఁకటి పైకిఁబోవ
కొంత తెలుపయ్యెనన నంతయింతఁ బుంత
వారిచూపుల కం దలవాటుపపడియె॥ 434

తే॥ గీ॥ ముంచుకొనఁ బ్రాకు నీతమంబునకు నిలువ
మనుచు దివిపీడి తారక లవనిఁబడెనో!
యనఁగ నల్లంతదవ్వుఁ గనఁగఁబడియె
దివ్వె లెన్నియొ మిణుగురు ల్తిరుగునటుల॥ 435

క॥ అరచాటగునాంధ్రవధూ
వరకుచకుట్మలముఁబోలి వనవృక్షప్రా
వరణమునఁ బటకుటీరము
గిరిదిగువారలకుఁ దోఁచెఁ గ్రీఁజాయ నటన్॥ 436

క॥ చీఁకటి మొయిలై దివ్వెలు
ప్రాకుతటిల్లతలుగాఁగ వాన దిగెనో నా

రేకెత్తెఁ గ్రమత సందడి
యాకడ వార్దరియనేగు నాసమయమునన్॥ 437

క॥ "అదె! మాస్కంధావారం!
బొదిగి రేయినిచట వేగ నొయ్యన నృపతి
న్వదకుద" మని సచివుండన
"నదిమే"లని నిలిచి రంద అప్పటి కచటన్॥ 438

ఉ॥ చీఁకటిపొంగులార్ప హిమశీతలవారికణాళిఁ జిమ్ముచు
న్రాఁకొనె వేగుగాలి," భయదప్రభ వచ్చెడుభానుఁ డేగుమీ!
పోక పెనంగితే న్వడుతుఁ బుత్తడిజాబిలిరేక "నంచుఁ దా
వాకొన డాయురీతి నెలబాలునితోఁ దగె వేగుచుక్కయున్॥ 439

శా॥ "తామిస్రంబన నాసవర్ణపద మద్దాని న్విదారింప పీ
రీమాద్రి న్దెగువెత్తెఁ దాళుమనె, నాయేపెల్ల మొల్లంబుగా
నామోపాది హరింతు"నంచు నుదయాశాచ్ఛాదకవ్యాపృతిన్
జీమూతం బట దక్షిణోత్తరవిదిక్ప్రష్టోగ్రతన్ నిండెడిన్॥ 440

ఉ॥ "తెంపరివై దినేంద్రునిగతి న్వికలీ! యరికట్టెదే? విచా
రింపవె దుష్టమైత్రి స్వనికృంతనమం? చవివేక మిట్టులే
దుంపలఁద్రెంపదే?" యనెడిత్రోవ ననూరుఁ డలుంగులేయ పె
న్దుర్రింపుల రక్తసిక్తముగఁదూఁగె దివి న్శకలీకృతాబ్దముల్॥ 441

ఉ॥ అంతకె మారుమూలలకునై పరుగెత్తుచు దింపుడాశ నొ
క్కింతగ సంశయించి యటులిట్టులు నిక్కుచు గుబ్బటిల్లి యా
యింతమురాశపోవఁ దమ మేడ్తెఁదూఁటె వనాంతరంబులు
న్గొంతలు గహ్వరంబులు సొరంగములు న్గిరిదుర్గగర్భముల్॥ 442

వ॥ అప్పు డాస్కంధావారంబు పటకుటీరంబులముంగు 442/1

సీ॥ "జగము న్గ్రహంబుగఁ జదల దిగ్భిత్తుల
సలమిన తమముబూ జవలఁబోసి
తొలి వేగుచుక్కవెల్తురు సున్నమున దిశా
కుడ్యమ్ముల న్వెల్లఁ గొలుపఁజేసి

హిమపంకమున నంకణముల లెల్ల నలికించి
మలయానిలపుకుంచె మాఁగుఁద్రోసి
యరుణోదయాభల హైమకుంకుమకాంతి
నందందు ముగ్గుల నలరఁదీర్చి
తే॥ గీ॥ విచ్చుసురభిళకుసుమసంపచ్చయముల
పుడమిపడతివిలాస మింపుగను దిద్ది
యల్లదే మాత సూర్యనాయణుండు
వచ్చెడిని దేవ మేల్కొనవలయు వేగ''॥ 443

క॥ అనువందిమాగధులకీ
ర్తనముల నిద్దురలుమాని తమకృత్యములె
ల్లను దీర్చి తగు వ్యవస్థఁ
బనుపఱచి నృపాలు వెదకఁ బయనంబగుచున్॥ 444

వ॥ వారివారికి సరిపడు మాఱువేసంబుల నాప్తులుతప్ప నొరు లెఱుంగకుండ, రాజపుత్త్రుండును, మంత్రియు, బ్రాహ్మణ ద్వయంబును, గతిపయసేవకులతో స్కంధావారంబు వదలి చనువారలు॥ 445

—♦ భారవి మాళవరాజాన్వేషణ మొనర్చుట ♦—

సీ॥ ఎక్కి రొక్కెడ సాంద్రహిమసన్నిపాతసం
జాతరాజతకాంతిధౌతగిరుల
డాఁటి రొక్కెడ క్రూరతరసింహశరభ శా
ర్దూలసత్త్వాకీర్ణ దుష్టవనులఁ
గ్రుంకి రొక్కెడఁ జలద్గురుతరంగావ ర్త
మకరాదిజంతుసంపన్న నదులఁ
-చి రొక్కెడ రత్నశోభితగోపుర
ప్రాకారవి స్తీర్ణ పట్టణముల
తే॥ గీ॥ కొట్టె రాడాకుఁ బచ్చికమేర లమల
మరకతాబద్ధకుట్టిమస్ఫురణ కెలరి

చేరి రౌకనాఁడు బహునదీసేవ్యమాన
పూర్వవారాశిగురుతీరభూమి నందు॥ 446

సీ॥ నిమ్నోన్నతంబులై నిడుపులై ఘనములై
వడిఁ దరంగంబులు పఱుగువాఱఁ
దద్గమనానువర్తనములై ద్రుతములై
వాయుచంక్రమణము ల్వర్తిలంగఁ
దద్బలోద్ధతములై దళములై సితములౌ
సికతాంబుదంబులు చెలఁగిపాఱఁ
దత్ప్రచారాలోలితంబులై పఱపులౌ
తృణసముత్కరములు మునిఁగి లేవ
తే॥ గీ॥ నతిగభీరంబు చిత్తదైన్యాపహంబుఁ
జిత్రసందర్శకంబు విచిత్రతరము
గా విరాజిల్లు మున్నీటిగట్టుపట్టు
గమనయోగ్యంబు బహుళసౌఖ్యప్రదంబు॥ 447

సీ॥ రేఁగి యువ్వెత్తులై మ్రోఁగి లోకముముంచు
రీతులౌ నలలయుద్వృత్తి మాన్ప
నవుటాలకన, నిల్చునరులపాదములక్రిం
దటిసైకతము దోఁకి దడఘటించు
కలుఁగు ల్వెలార్చి యిక్కడనక్కడం దోలి
యెంద్రల విహగాళి కేళి యిచ్చు
నరమృగపాదచిహ్నములచేఁ జెదరిన
తీరంబుఁ జదునుగా మీఱఁజేయు
తే॥ గీ॥ తటమునకుఁబాటి మఱలు నుత్కటతరంగ
గతిఁ గనంగన నింకనుం గనఁగ వేడ్కఁ
గొలుపు వివిధరసోద్గతి గుబులుకొనఁగ
చిత్రచిత్రప్రభావమై చిత్రి డసర॥ 448

తే॥ గీ॥ తటమునకు ప్రేమఁతత్తోఁబాఱు తరఁగ, లందు
మెఱయుబాలార్కకరముల మినుకు లెగపి,

పాశముల లాగుకొని పసిబట్ట దుమికి
మొఱగి మూచూచు జాగిలంబులుగఁదోఁచు॥ 449

తే॥ గీ॥ చేపలకు వచ్చిపోయెడి చిన్నచిన్న
పల్లెకారులదోనెలు పర్వగతుల
మొయిలుతుడుములలోన దోఁబూచులాడు
చిన్నజాబిల్లివైఖరిఁ జెలఁగియాడు॥ 450

తే॥ గీ॥ ఏమి నీగొప్ప ? గర్వింతు వేల నభమ ?
యలఁతిశశిరేఖకా యింతయదరిపాటు ?
శతసహస్రము లివె యన్న సరణి నుదధిఁ
బల్లెకారులదోనె లుత్పతనమూను॥ 451

తే॥ గీ॥ కడఁక భూదేవిఁ జేరి నాగరుఁడు మించి
ముత్తియము లేర్చి పూజించుపోల్కి సలిల
శీకరము లుత్పతద్భంగసృష్టి నుఱుఁగు
చేర్లువాఱెడు తీరంబు చెంతలందు॥ 452

శా॥ "ప్రాకారంబు లగడ్తలు న్బురుజులు న్బైజు ల్కృతఘ్నాళి త
న్మేకాలంబునుగావఁ గోట లిలఁ దామొందు న్మహాపాయని
త్యాకుంఠంబులెపో" యటం చనిలవాహ్యాళి న్యథేచ్ఛ న్మహా
నౌకల్తేలుటఁ జూపి యబ్ధి నగు ఫేనశ్రీమిషంబూనుచున్॥ 453

సీ॥ పీలము ల్తళ్కులు నెఱులుగా నలలపై
మింటియాఁగడప మేల్మిని రహింప
నటకొండనిడ యస్త్రాద్రిఛాయయనంగ
తమము వైఖరిఁ బూని క్రమత నెగయఁ
గెలఁకుల నలలతాఁకుల స్వచ్ఛత న్మించు
పలుగుజా ల్మినుకులభాతి మెఱయ
బల్లెకారుల దోనెపడెవలు మెఱచాప
లందందు మొయిళుల యంద మొంద

తే॥ గీ॥ వనధిలో మిన్నె ప్రతిఫలించెనో? నభంబు
నందు వనధియె ప్రతిబింబ మందెనో కో!

అదియెటులనున్నఁ గనువారి యక్షులందు
రెండుబింబించి కన్నులపండువౌనఁగ॥ 454

ఉ॥ గొప్పతరంగము, ల్తటముఁగొట్టి యెదిర్చెడివాని తాఁకున
న్గుప్పునఁగూలఁ దుంపురులు గుంపులుగాఁ జెలరేఁగి దోనెల
న్గప్పుటఁజూడ, బాలశశి కైపురి కిట్లొనఁగూడె, వీడఁగా
నొప్పదటంచుఁ, దండ్రి, తనయు, న్దనకౌఁగిలిఁజేర్చున ట్లగుఁ॥ 455

సీ॥ బడిఁబడి యెడలేనివడిఁ బూని పడునీటి
నడఁ గూర్కుచూపువిన్నాణమేమొ!
యుడివోనిజడిగ నేర్పడుహోరు లడర దో
ప్పలఁదోఁగు శ్రవణసౌబాగ్యమేమొ!
తెగతెంపువడక చల్లఁగ హాయి నూఁగించు
గాలిసోక్కిన మేనిబాళియేమొ!
కనలుఁ జెవు ల్మేనుఁ గైకొన్న ముప్పోకఁ
బురివడ్డ మనసుమేల్పులక లేమొ!
తే। గీ॥ శ్రమను దొలఁగించు మఱపించు సకలజగముఁ
జింత లడఁగించు నేకాగ్రచిత్త మొసఁగుఁ
నౌర! తీర్థాధిపతి యిట్టియమలపదము
దయఁబ్రసాదింప మోక్షంబు దవ్వెయింక?॥ 456

తే॥ గీ॥ మోక్షతత్వ మెఱింగినబుధులు వారె
"హాయి! హాయి!"యటంచుఁ గొండాడుచుండ
నంచితానందకరము రత్నాకరం బ
టంచు నతిదూర మిట్లు నేనెంచనేల?॥ 457

శ్రీభట్టు సీ॥ కనుమిా! యశోధనా! మనలఁ గన్గొని వార్ధి
ప్రత్యుద్గతిని బొంగు పర్వపటిమ
వినవోయి! చలదూర్మిజనితగంభీరస్వ
నావేశమున నిచ్చు స్వాగతోక్తి
నందుకోవోయి! మందానిలకలితవీ
చీసమర్పితపాద్యశీతజలము

లారగింపఁగదోయి! సారతరంగని
ర్మథనజాతసుధాకరద్రవంబు
తే॥ గీ॥ మఱు వెఱుఁగవోయి! హిమకరకిరణతరణ
సరణిఁ దరఁగల చెఱలాట దిరుగురుచుల
హాయి! యనవోయి నవరసదాయి కెరఁగి
యెఱుఁగవే శౌరికిని మామ యాతఁడనుచు॥ 458

భా॥ సీ॥ పలుకుచున్నాఁడేమొ? చిలువరాయనిమీఁదఁ
గొలువున్నహరి నిరాకులసువార్తఁ!
య॥ దెలుపుచున్నాఁడేమొ? తొలిపల్కుదొంగనా
దిమమీనరాజు వధించువార్త!
నా॥ వినుచున్నాఁడేమొ? విస్మయకరమైన
క్షీరాబ్ధి సుధ బయల్దేరువార్తఁ!
శ్రీ॥ జెప్పుచున్నాఁడేమొ! శివజటాజూటని
ర్వాసితగంగాప్రవాహవార్త!
భా॥ నెఱుఁగఁజేయుచునున్నాఁడో యేమొ! మున్న
గస్త్యుఁ డొకగ్రుక్కఁ దనుఁ ద్రావఁగనినవార్తఁ!
శ్రీ॥ బాడుచున్నాఁడొయేమొ! ప్రపంచఘటనఁ
గాలశాశ్వతకళ్యాణకలితవార్త॥ 459

నా॥ సీ॥ సురల సుధాసుధాకరముఖ్యములనిచ్చి
కరమాదుకొనియె సాగరుఁడుకాఁడె!
భా॥ నరుల కనర్ఘరత్నశ్రీఁబ్రసాదించి
కనిపెట్టియుండు సాగరుఁడుకాఁడె!
య॥ దంభోళినిర్దయాఘాటికోర్వనిగిరీ
డ్వరులఁ గాపాడె సాగరుఁడుకాఁడె!
శ్రీ॥ వారధికై గొప్పపర్వతాల్తెలించి
హరికిఁ దోడ్పడియె సాగరుఁడుకాఁడె!
భా॥ తటిఁ దలఁగనీక మేఘబృందములఁబంపి
కర్షకప్రీతినొసఁగు సాగరుఁడుకాఁడె!

నా॥ వేలఁ దాటక కల్లోలపాళి నడఁచి
పరమసంతోషమిచ్చు సాగరుఁడకాఁడె!॥ 460

భా॥ సీ॥ చలువచప్పరము భూజలజాతనయనకు
భ్రమణోద్ధదారుణశ్రమమువాయ
సిరులబిడా రిలాసింహాద్రమధ్యకు
మణిమౌక్తికాలంకరణమొనర్ప
రుచులసోన ధరావరూధినీమణి కార
గించి బిడ్డలను బోషించుకొనఁగ
వైద్యుతప్రబలసంపద్రాశి ధారుణీ
మాత కాత్మీయవిఖ్యాతినెఱప
తే॥ గీ॥ భూతపంచకమునను బృథ్వీతరుణికి
మిగులదగ్గరచుట్టంబు తగులుపొలము
సంతతాశ్లేషసుఖపరిష్కారగౌర
వాంచితం బౌర! పుడమి కీయబ్ధిరాజు!॥ 461

నా॥ క॥ ధరణీజనని యొడిని సా
గరుఁడను శిశు వాడుచుండి కడునాఁకలిచే
కరములనుసాఁచి పాలకు
నరసెడి చందమగు నదులయమరిక, వహవా!॥ 462

య॥ గీ॥ ధారుణీమాతయొడిఁ బాలు ద్రావుసాగ
రార్భకుం డేటికరముల నట్లుసాఁచి
యూమెగైరికవేణిపై నలరుమంచు
గడ్డసొమ్ములఁబుణుకు నాగడము భళిర!॥ 463

శ్రీ॥ తే॥ గీ॥ పుడమితల్లి శిరోభారముడుప జలధి
తనచలువనంతయును మేఘతతుల నింపి
పంప నవి మంచుగడ్డలై వ్రాలి కరఁగి
యేరులై తెల్పెఁబోలు సందేశఁగువార్త॥ 464

వ॥ అనినఁ బ్రకృతివిచిత్రశోభలకు ముగ్ధుండగుచున్న భారవి శ్రీభట్టు
నవలోకించి 465

తే॥ గీ॥ నీటిలోఁ బాడబము కొండనెత్తమందు
మంచుగడ్డలపేరు డమర్చినాఁడు
తుదమొదలులేనిదైవ మంతుఁ గనుకంటె
గడ్డుగాఁదోఁచె నీసృష్టిగతి నెఱుంగ! ॥ 466

సీ॥ ఆకసమెత్తదెంతని కొల్వఁ జనుభాతిఁ
జూడనందని శిఖాశోభగిరులు
నాయెత్తునకు నింక నంతంతలోలోతు
లమరఁ గ్రాలుచునుండు నంబునిధులుఁ
బర్వతాగ్రములకుఁ బాథోధులకు లంకె
బాటలై యెప్పుడు న్పాఱునదులు
సముల కిరువంకల నయనపర్వములుగా
ఘనదుర్గపట్టణగ్రామవనులు
తే॥ గీ॥ గ్రాసవాసంబులకు లోటుగానియట్టు
లుదధిలోపల భూమిపై నుండువసతు
లట్టినిండున కానందమందకే స
తంబుఁబోరెడు జంతుసంతానమార! 467

వ॥ భారతఘోరరణంబు ప్రారంభంబుగా నిద్ధారుణి యీతీరుననే యవయుచుండె నేమోగదా! భూభారధారేయులుగాఁదగు క్ష్మార మణుల యన్యోన్యారంభంబు లన్యోన్యమారకంబు లగుచుండుట కేమికారణంబొకో! 468

శా॥ "ఏభూఖండము లెట్లుమాఱినవొ? యేయేరాజు లేరీతి నా
యాభూమి న్పరియించుచుండిరొ బుధేంద్రానీక మేతీరొ? యెం
దేభక్తిప్రభ లెట్టులున్నవొ త్రిలోకేశుండు నారాయణుం
డేభవ్యాకృతిఁ గ్రమ్మఱ న్పుడమిపై కేతెంచునో హేలకై॥" 469

క॥ అనుభారవికౌతూహల
ము౽ కనుమూపముగుంచి త్తమున శ్రీభట్టుం
చినమాత్రఁ దచ్చరిత్రం
బనువుగఁ దనమానసంబు నందెనయుటయున్॥ 470

సీ॥ కరుణారసంబు కన్గవఁ గ్రందు కొనుచుండఁ
జిన్నఁబోవుచు మోము చెన్నుదఱిగెఁ
రౌద్రంబు ప్రళయసంరంభంబుగా రేఁగఁ
గను లింతలై యెఱ్ఱగాఱఁదొడిగెఁ
దతభయానకమహోద్ధతిసోఁక నత్తుల
కళజాతి కంప మంగమునఁదోఁచె
భీభత్సమెనసినఁ బ్రిదిలినతమి నిండు
వెగటాస్యమున నుద్భవించుచుండె
తే॥ గీ॥ వీర్యమున శౌర్యరభసంబు వెలసెమేనఁ
జొక్కు-శృంగారమున హాయిఁజూపె నొడలు
వింతచెలువూనె నద్భుతాక్రాంతిఁ గాయ
మధికశాంతాప్తి దేహ మందడరె సమత॥ 471

తే॥ గీ॥ అన్నిరసములుఁ జివరకు సున్నయనుచుఁ
దోఁపఁగాఁబోలు హాస్య మత్యుద్భటముగఁ
దెగి శరీరంబుఁబెంప మంత్రివరు డురక
కిలకిలని నవ్వసాగె సంగీతసరణి॥ 472

తే॥ గీ॥ అద్దమునఁదోఁచుపాప కెట్లట్లు వారి
భావములలోనఁ, దద్భావహావవివిధ
భేదములు బిట్టుగాఁ బాఱి పొదుకొనఁగ
వారలందఱు నబ్బురపడిరి మిగుల॥ 473

వ॥ తత్సమయంబున యశోధనుం డబ్భావవైపరీత్యంబులకుఁ గతంబెఱుం గంగోర నెల్లరంగలయుం గనుంగొని శ్రీభట్టిట్లనివచించె "అద్దిరా! శ్రీమన్నారాయణుని చిత్రవిలాసమహాత్వం బెంతనికొండాడఁగలను?

భు॥ బలేకొంటె! మాయాప్రపంచంబులోన
న్గలేకల్పుగా నిండి గమ్మత్తుఁజేయు
న్గిలారించు నవ్వించుఁ గేరించు నొంచు
న్భలంబిచ్చు లాలించుఁ బాలించులీలన్॥ 475

